ed for Class use by Andhra T. B, C. Vide Gazette
Suppl. to Part I, 5-5-55 Page 15.

# పుష్పవాటి

ఉపవాచకము - ఉన్నతఫారములకు


గ్రంథకర్త:
కవి భట్టారక
మొవ్వ దాశరథి సూరి



ప్రకాశకులు:
ఆదర్శ విద్యామండలి, తెనాలి.
సాహిత్య విద్యాప్రచారకులు

ాపాయ

# పుష్పవాటి

ఉపవాచకము – ఉన్నతఫారములకు

గ్రంథకర్త:
కవి భట్టారక
మొవ్వ దాశరథి సూరి

ప్రకాశకులు:
ఆదర్శ విద్యామండలి, తెనాలి.
సాహిత్య విద్యాప్రచారకులు

వెల: రూపాయి

# తొలి నుడి

అన్యతస్సిద్ధముగాని యొక యుత్తమజ్ఞానమును దువుగా లోకమున కందఁజేయుటయే కవుల కర్తవ్యము. విషయము నందఁజేయుటలో శాస్త్రముల కన్నఁ గావ్యములకున్న చాకచక్యము మార్దవమే. భావ ప్రతిపాదనమునకు శబ్దము ముఖ్యసాధనము. అది తన ప్రౌఢ స్వరూపమున విజృంభించినచో విషయము కతిపయైకవేద్య మగును. బాలురయు నపండితులయు లేఁతమానసముల నది కలఁచివైచును. విద్యార్థులకే యుద్దిష్టమైన యీ చిన్న పొత్తమున నట్టి శబ్దాలంకారములకు నితర కావ్యగుణములకుఁ దావులేదు. భాషాభిమానము, ప్రాచీన చరితాభిజ్ఞత, నీతి, మున్నగు సద్గుణములు బాలురకు గలుగవలయునను తలంపే లోని కథారచనకు బీజము. ఈ పుష్పవాటి సహజ పరిమళముతోఁ బాలకుల మృదుహృదయముల నలరించుఁ గాక. భాషాభివృద్ధికై పాటుపడుచున్న యాదర్శ విద్యామండలివారి పవిత్రాశయ మప్రతిహతముగా గమ్యస్థానముఁ జేరుగాతమని యాశించు చున్నాఁడ.

ఇట్లు

కవిభట్టారక

మొవ్వ దాశరథి సూరి

## విషయసూచిక

# గండపెండారము

౧

ప్రభావంబు వెలయించి ముదిమిచే బలజవంబు లుడిగి యున్న మహాపూరుషునిఁ బోలెఁ బశ్చిమగిరి శిఖరంబున మందరశ్మియై యెఱ్ఱవాఱిన బింబముతో సూర్యుండు చూడ నింపగుచుండె. సౌమ్యమైనకాంతితో ముదియెండలు సమస్త వస్తువులకు వింత తళుకులు కల్పించుచున్నవి. పక్షులు వరుసలు వరుసలుగా నప్పుడే గూండ్లకుఁ జేరుకొనసాగె. కాలిగిట్టలచే రేగిన ధూళులు మింటఁ గప్పుకొన నంభారవంబులు సేయుచు నగర ముఖంబువట్టి వచ్చు పశువులు పరుల దొడ్లయందుఁ జొచ్చినంతటనె వెనుక దూరంబున సంగడికాండ్రతో మాట్లాడుచు వచ్చు పసులకాఁపరి పిల్లలు పరువు పరువున నరుదెంచి యదలించి ఋజుమార్గంబునఁ ద్రోలుకొని పోవుచుండిరి. అంతవరదాఁక గుట్టలువైచిన పేడ యంతయు పల్లికలలో నింపుకొని కొందఱు వనితలు త్రోవవెంట నరుగువారిని వాని నెత్తుటకై పిలుచుచుండిరి. ఉబుసుపోకకై పురంబు వెల్వడి దూరంబుననున్న కొండలకడ కేగి విశాలప్రదేశంబుల జట్టులు జట్టులుగాఁ గూర్చుండి వినోదకథాలాపములు సేయువారి దేహంబులకు సుఖప్రదంబుగా సోఁకి మలయపవనంబులుత్తరాభిముఖంబులై ప్రయాణించుచుండె.

అట్టి సమయంబున విద్యానగర గోపురద్వారంబు దాఁటి రూపవతులైన యువతులిరువురు పుష్పయోగ్యంబులైన

బుట్టలు హస్తంబులం దమరఁ దుంగభద్రానది దక్షిణపు టొడ్డు వెంటఁ నొయ్యారంబు తొనఁకు గమనంబుతోఁ బోవుచుండిరి.

వారట్లు పడమటి ముఖంబుగా దూరంబరిగి రమణీయంబైన యొక పూలతోఁటయందుఁ బ్రవేశించిరి. అదియొక విశాలమైన యారామము. "ఇది యున్నది యిదిలేదు" అని యనకుండ సమస్త పుష్పజాతు లందుఁ గలవు. వారు తమ బుట్టలు సగపడ నిండునట్లు పువ్వులు త్వరత్వరగాఁ గోసికొనిరి. చేయెత్తి పూ రెమ్మ వంచుచు నొకామె యట్టె వెనుదిరిగి "మాధవీ! లతలన్నియు మెత్తని చిగురులతో వసంతశోభ నెట్లు వెలార్చుచున్నవో చూచితివా?" యనెను. లవలీ! చూడ కేమి! వసంతశోభ యని స్మృతికిఁ దెచ్చితివి. వైశాఖ శుద్ధ పంచమి సమీపించుచున్నదిగదా! నయనానందముగా వసంతోత్సవములు జరుగును గాబోలు. సామంత రాజన్యులు సేవింప నిండు ఠీవితో విద్వద్గోష్ఠిఁ గావించు కృష్ణరాయ ప్రభువును మరల నొకసారి చూడఁగలముగదా. ఉత్సవాంతమున బహుమతులు గైకొని ప్రభుని దీవించు విద్వజ్జనుల సంతోష మెంతనవచ్చు. ఆహా! యేమి వైభవము! ఏమి నాటక ప్రదర్శనములు! ఏమి యక్షగానములు! ఎట్టి కవితాసభలు.

లవలి: అగును. గడచిన వసంతోత్సవములు నేఁటికిని గన్నులఁ గట్టినట్లున్నవి. నాఁటిరాత్రి మణిమంతుఁడు ప్రదర్శించిన "భామ కలాపము" మెచ్చఁదగినదిగదా, పుష్పదత్తుని మోహినీవేషము, ప్రతిదినము నిద్దురలోఁగూడఁ గనుపట్టుచునే యున్నది.

మాధవి : మనోరమ గానసభ చేసిననాఁడు నీవు లేవా ? రూప మునకుఁ దగిన గాత్రము. గాత్రమున కీడైన విద్యాపటిమ. వీని నన్నిటిని మించిన లే జవ్వనము. సభయంతయు నా రోజున నానంద కోలాహలము చేసినది. అంత చిన్నవయ స్సున నామె యంత కౌశల మెట్లార్జించెనో గాంధర్వ మవనికి దింపి వదలినదిగాని సామాన్యమా !

ల : పోయిన వత్సరమున జరిగిన యొక మహాసన్నివేశము నీకు గుర్తున్నదో లేదో మను చరిత్ర కృతిసమర్పణము. ఆనా డెచటినుండి వచ్చెనో యంతజనము : తీర్థ ప్రజయై పోయినది. విద్యానగరము నలువైపుల నిసుక జల్లిన రాలలేదు. అంత జనసమ్మర్ద మిదివఱ కెన్నడును జూడలేదు.

మా : జనులకేమిగాని కృతిసమర్పణానంతరమున నంతటి ప్రభు వా బ్రాహ్మణునిఁ బల్లకీలోఁ గూర్చుండఁ బెట్టి యూరేఁగింపునకుఁ దనచేతులతోఁ బట్టి యెత్తెను. ఎంతటి కవితాభిమానము !

ల : నిశ్చయమే. రాయలువా రట్టి సత్కారముఁ జరిపినందుల కసూయపడి యితర కవులు కొన్నిదినములు పెద్దనగారితో సరిగా మాట్లాడలేదఁట. చారుదత్తుఁ డొకనాఁడు నా కీ విషయమును దెలిపినాఁడు.

మా : అది లోకసహజము. తమకు లేదని యొకటి యితరుల కున్నదని యొకటి రెండు చింతలు సదా మానవుల బాధించుచుండును. తాముకూడఁ గవులైనంతమాత్రమున నేమి ? యా సొంపు రావలదా ? అది వారివారి పూర్వ

సుకృత విలసితము. రసజ్ఞులు వానిని గౌరవించిరే యని యారాటపడినఁ బ్రయోజనముండునా ?

ల : సరేగాని యుత్సవము లీ సంవత్సర మెట్లు జరుగనున్నవో?

మా : మఱింత శోభగా జరుగవచ్చును. ఒకనాఁటి రాత్రి అమ్మాయిగారు తిరుమలాంబ యడుగుచున్నది. "నాన్న గారూ! వసంతోత్సవములు వచ్చుచున్నవి గాఁబోలు నీ వత్సరమున విశేషము లేమి? యని. ఈ యేఁడొక మహా కార్యము నెరవవలెనని యున్నది, ఈశ్వరేచ్ఛ యెట్లుండునో యని ప్రభువులు సమాధానము చెప్పిరి. మొత్తముమీఁద వక్రనాసుని హాస్య ప్రసంగములు మరల నొకసారి వినఁ గలము.

ల : చెలీ! మాటల సందడిలో మఱచితిమి. ప్రొద్దు గ్రుంకు చున్నది. ఆలసించినందుల కమ్మగార లేమందురో! పదపద.

వార లిరువురును విద్యాభోజుఁడని ప్రసిద్ధినొందిన శ్రీకృష్ణదేవరాయల భార్యలైన తిరుమలదేవ్యన్నపూర్ణా దేవుల చెలికత్తెలు. అప్పుడప్పుడా పట్టమహిషులు సంధ్యా సమయముల నారసింహస్వామి కోవెలకుఁ జనుచుందురు. నాఁడు దేవార్చనమునకై రాజోద్యానమునఁ గుసుమములు దెమ్మని చెలికత్తియలఁ బంపిరి. ఆ వేళకు వారచట స్నానము లొనర్చి యుచితవేషంబులతోఁ బ్రయాణ సన్నాహంబున నెదురు చూచుచుందురు. కావున నా వనితలు మాటల మఱపున నాలస్య మొనరించినందులకు విచారపడుచు నారామంబునుండి గృహాభిముఖులై బిర బిర నడవసాగిరి.

అప్పటి కప్పుడే నగరి వీథులయందలి దీపములు దూరమునకు మినుకుమినుకుమనుచుఁ గన్పించుచుండెను. సంజచీఁకటిలో నా యువతులట్లు పోయిపోయి విజయనగర రాజమార్గమందలి జనబాహుళ్యమున లీనమైపోయిరి.

౨

ప్రతి సంవత్సరము వైశాఖశుద్ధ పంచమి మొదలుకొని కొన్నిరోజులు నగరోత్సవములు జరుపుట విజయనగర రాజుల కానువంశికముగా వచ్చుచున్న యాచారము. ప్రజల కా దిన మొక మహాపర్వము. అన్నిరోజులు నాటకములు, భరత నాట్యములు, గానసభలు, చిత్రవస్తు ప్రదర్శనములు మొద లైన వినోదము లెన్నియో చేయుచుందురు. దూరదేశముల నుండియుఁ దండోపతండములుగా వచ్చి పురమున వసతు లేర్పఱచుకొని మహాజన ముత్సవ వైభవమును జూచిపోవు చుండును. అట్లు వారు విడువక యేఁటేఁట వసంతసమయ మున నుత్సవములు జరుపుటకుఁ గారణము లేకపోలేదు. ఆనెగొంది సంస్థానాధీశ్వరుఁడైన హరిహరరాయలు తమ్ముఁ డైన బుక్కరాయలతో నొకదినమునఁ దుంగభద్రా నదీ తీర మున వేఁటాడ నరిగెను. కొంతవడి యా యన్నదమ్ము లిరువురు క్రూరసత్వముల వధించిరి. నదీతీరమున నా యరణ్యములో వారికొక దేవాలయ మగపడెను. అది పంపేశ్వరుఁడైన విరూ పాక్షస్వామి నిలయము. స్వామి కచటఁ బూర్వరాజు లెవరు గట్టించిరో యాలయము జీర్ణప్రాయమై యున్నది. ద్వారము

నందును స్వామి చుట్టునుగూడ సాలెపురుగులు గూండ్లల్లినవి. ఆ విజన స్థలంబున నొంటరిగా నిర్భయుఁడై కాఁపురంబున్న విరూపాక్షుని దర్శించి యన్నదమ్ము లిరువురు మ్రొక్కిరి.

ఆలయము నిర్గమించి వారు కొలఁదిదూర మేగుసరికి రెండు కుందేళ్లు పొదలోనుండి వెడలిపోవుచుండెను. బుక్కరాయలది చూచి వెంటనున్న వేఁటకుక్కలను వానిపై కుసికొల్పెను. కుక్కలును భౌభౌ మనుచుఁ బోయి పైనిబడెను. కాని యా శశము లించుకంతయుఁ జలింపక చెవులు నిక్కించి కుక్కలమీఁదికిఁ బరాక్రమించెను. వాని సంరంభమున కాగలేక వేఁటకుక్కలు వెనుదిరిగి పాఱఁజూపెను. కుందేళ్లు కుక్కలను వెంటనంటి కొంతదూరము తఱిమి చాపబాణాసిధరులైన యన్నదమ్ములఁ జూచి మరలిపోయెను. చావుఁ దప్పించుకొన్నయవివోలె కుక్కలు గడగడ వడంకెను. అది చూచిన హరిహరరాయలకును బుక్కరాయలకును గడు వింత యాయెను. ఔరా! కుందేళుల పరాక్రమము! అని యాశ్చర్యపడుచు సాయంకాలమునకు వా రిలు సేరిరి.

రెండవనాఁ డుదయమునన లేచి చేరువనున్న యగ్రహారములోని విద్యారణ్యుల యాశ్రమంబునకుఁ జనిరి. విద్యారణ్యస్వామియు నాయన తమ్ముఁడగు సాయణుఁడును నానెగొంది ప్రభువులకు గురువులు. ఆ సోదరు లిరువురు మహా పండితులు, నైష్ఠికులు, తపస్సంపన్నులు, తేజోమూర్తులు. వారు ధర్మవిషయముల నిర్ణయింప వానిని దా మనుష్ఠించి ప్రజలచే నాచరింపఁజేయవలసిన వా రానెగొంది రాజులు.

లౌకికాలౌకికములైన సర్వప్రసంగములయందును నా తాపసుల యనుజ్ఞలేనిది సంస్థానేశ్వరులు కాలుగూడఁ గదల్పరు. సామ్రాజ్య పరిపాలన మంతయు నా బక్కబ్రాహ్మణులపై నాధారపడి యున్నది. కలిగిన సందేహములన్నియుఁ బ్రభువులకు వారే తీర్పవలయు. అప్పుడుగాని వారికి నాత్మతృప్తి గలుగదు. అట్లే యా సన్న్యాసు లిరువుర కా సంస్థానమన్న నింతంత యనరాని యభిమానము. దాని యభివృద్ధికిఁ దమ తపస్సర్వస్వమునైన ధారవోయుట కా యన్నదమ్ములు వెనుకాడరు. అగ్రహారముతో వారి కేమియు సంబంధములేదు. దాపుననున్న యొక మామిడితోఁటలో వారి యాశ్రమము. బ్రహ్మచారులైన బ్రాహ్మణ బాలకులు చాలమంది యగ్రహారమున మాధుకర మెత్తుచు వారికడ వేదపాఠము లభ్యసించుచుందురు. అనధ్యాయములయం దా శిష్యుల జనపదంబులకుఁ బంపి ప్రజానీకమునకు ధర్మవర్తనము, భూతదయ, దేశభక్తి మొదలగు పెక్కుసద్విషయముల బోధింపఁజేయుదురు. నిర్లిప్తులైన యా మానిసత్తములకు భోగములతో నవసరము లేదు. ప్రజలకేమి, ప్రభువులకేమి యా సోదర్యులు దైవస్వరూపులు. వారికి రెండే ప్రధానాంశములు. మొదటిది యాధ్యాత్మిక విచారణము. రెండవది సంస్థాన పరిపాలనము. మూడవదానితో నెన్నడును బ్రసక్తి లేదు.

రాజసోదరు లరుగునప్పటికి సాయణుఁడు తాను వ్రాసిన వేదభాష్యమును శిష్యులకుఁ జెప్పుచుండెను. విద్యారణ్యులొక చిత్రాసనమునఁ గూర్చుండి పూచికలు చీల్చుకొను

చుండెను. పార్థివులఁ జూచినంతనే శిష్యులు రెండు దర్భాసన
ములు దెచ్చి స్వామి సమీపమున వైచిరి. హరిహరరాయ
లును దమ్ముఁడును యతులకు నమస్కరించి నేలమీఁదనే
గూర్చుండిరి. కుశల ప్రశ్నాదికమైన పిమ్మట విద్యారణ్య
స్వామి "ప్రభువుల కేదియో సన్యాసులతోఁ బనిగల్గెనే" యని
నవ్వెను. "ఇప్పుడు క్రొత్తగా గల్గుటేమున్నది. స్వాముల కటాక్ష
వీక్షణములోనే యున్నదిగదా యానెగొంది బ్రతుకు" అని
హరిహరుఁడు తుంగభద్రా తీరమునఁ గుందేళ్లు నెరపిన శౌర్య
మును విన్నవించెను. వినుచుండగనే యొక మహానిధి దొరకిన
వానికిఁబోలె స్వామి నేత్రములు హర్ష కాంతులు చిమ్మ
సాగెను." నిశ్చయముగానా? యట్లయిన నిప్పుడే పోయి యా
స్థలము చూడవలయును. బ్రయాణము సిద్ధము చేయుఁడని
తమ్మునివంక కుఁ దిరిగి సాయణా! దైవమొక త్రోవఁ జూప
వచ్చు ననెను.

దేశమున నప్పుడప్పుడే మహమ్మదీయ పరాక్రమములు
వికసింపసాగెను. పరస్పర మైత్రిలేని హిందూరాజుల కంతఃకల
హములు సృజించి యటనట యవనులు వారి రాజ్యము
లాక్రమించుచుండిరి. కల్లోలములు తలయెత్తుచుండెను. హరి
హరరాయల దోర్బలముచే సురక్షితమైయున్నను నానెగొంది
సంస్థానమునకు దుర్గ సంరక్షణ విధానము సరిగా లేకపోవుట
లోపముగానే యున్నది. అందువలన మంచి దుర్గస్థానమునకు
రాజధాని మార్చవలయునని దీర్ఘదర్శియైన స్వామి సంకల్పము.
దానికై యంతః ప్రయత్నములు జరుగుచునే యుండెను. హరి

హరుఁడు చెప్పిన యీ వృత్తాంతముచే మునిహృదయమున నాశారేఖ లుదయించెను. విద్యారణ్యస్వామినిఁ బురస్కరించుకొని హరిహరాదులు నాఁడే ప్రయాణముచేసి యా స్థలమున కరిగిరి. పంపాహృదయేశ్వరుండైన విరూపాక్షుని సందర్శించిరి. ఆనుకూల్యము నెరపుమన్ని వేడికొనిరి. నదీతీర పరిసరము లన్నియుఁ బరీక్షించిరి. తిరిగి తిరిగి మౌని యొకచో నిలిచి బలే! చిరకాలవాంఛిత మీడేరెనని పలికెను. స్వామీ! ఏమి విశేషమని హరిహరుఁడు ప్రశ్నించెను. వత్సా! దుర్గ రచన కిది యనువైన చోటు. రాజధాని నిటఁ గట్టవలయును. నగర మిట నిర్మించిన దేవతలైనఁ దేరిచూడఁజాలరు. స్థల మహత్త్వ మిది. ఇట జన్మించిన చిగురుఁ గొమ్మ యైనను జేవగానే యుండును. ఈ గడ్డపై నివసించువారి రక్తమునఁ బరాక్రమము క్రేళ్లుఱుకుచుండును. కుందేళ్లు కుక్కలపై విజృంభించుట కిదియే హేతువు. తప్పదు, పురనిర్మాణ యత్నము లాలసింపక చేయుమని, యాదేశించి మౌనిసత్తముఁడు వెనుకకుఁ దిరిగెను. స్థలనిర్ణయ మిట్లు చేసి వారు స్వస్థానాభిముఖులైరి.

తుంగభద్రాతీరమున వేలకొలంది జనులు మహారణ్యమును ఛేదింపసాగిరి. కొలఁది కాలముననే యా స్థలమంతయు పట్టణ నిర్మాణమున కనువయ్యెను. దీర్ఘముగా నాలోచించి విద్యారణ్యులొక శుభలగ్నము నిర్ణయించిరి. అది ధాతృనామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమి. నాఁటి రేయి తెల్లవాఱుజామున నిరువదియైదు గడియలకు శంకుస్థాపన

ప్రతిష్ఠింపవలయును. రెండుమూడుదినములు ముందుగనే హరిహరుఁడును బుక్కరాయలును నా తావునకు సపరివారముగాఁ జేరుకొనిరి. పరికరములన్నియు సమకూర్పఁబడెను. స్వామి తమ్మునితోడను శిష్యులతోడను నుచితసమయమున కచట జేరెను. పంచమి దినం బంతయు హరిహర రాయలును నతని పట్టమహిషియు నుపవసించిరి. పూజాపురస్కారములులేక యెప్పటి నుండియో పాడుబడియున్న విరూపాక్షస్వామి కానాఁడు సహస్ర కలశాభిషేకముఁ గావించి సెలవుఁ గైకొనిరి. తపసు లిరువురు దగ్గఱనుండి యథావిధి వాస్తుపూజ నిర్వర్తించిరి. సూర్యుఁ డస్తమించెను. తుంగభద్రానదియందు మునుకలిడి స్వామి తన నిత్యానుష్ఠానమును నెరవేర్చుకొనెను. అప్పటికి రాత్రి పదిగడియలు ప్రొద్దువోయినది.

ఆ కాలమున నిప్పటికివలెఁ గాలమానమును సూచించు గడియారములు లేవు. నక్షత్రముల యుదయాస్తమయములచే రాత్రులఁ బ్రొద్దు గుర్తింపవలయును. అయితే వారి గుఱుతు లిప్పటి గడియారములవలె నొకదాని కొకటి సంబంధములేక భిన్నభిన్నములుగాఁ గాలమును సూచింపవు. తప్పపాట్లతోఁ గూడ సరిపడవలయును. కాని యాస్థలమున నొక చిక్కేర్పడెను. అది కొండల నడిమి ప్రదేశమగుటచే నక్షత్రగమన మచటికి సరిగాఁ గానరాదు. అందులకు విచారించి తాపసోత్తముఁడు సాయణాచార్యులను హరిహరరాయలను బిలిచి "ఇచట మనకుఁ గాలము సరిగాఁ దెలియదు. కావున నేను తూర్పుననున్న యా కొండమీఁదికిఁ జని సమయము నెఱింగి

శంఖ మూఁదెదను. శంఖధ్వని వినుటతోడనే యిచట మీరు వాస్తుపూజ చేసిన ఖాతమున సీసము గరఁగి శంకుఫలకమును బోయుఁడు. నిమేషము తప్పినను మన యీ ప్రయత్నమంతయు విఫలమగును. కడు జాగరూకులరై యుండుడని చెప్పెను. దగ్గఱ నుండి సక్రమముగా నెఱవేర్పుము. నీమీఁద నీ భారము వదలి నేను వెళ్లుచున్నాను. జాగ్రత్తసుమీ! యని తమ్ముని హెచ్చరించెను. "మీ యనుగ్రహమువలనఁ జక్కఁగానే యాచరింపఁగలము. 'ఫరవాలేదు.' మీరు పొండు" అని వారిరువు రేకగ్రీవముగా వచించిరి. అంతఁ దగిన కట్టుబాటు లన్నియు నిట్లు గావించి యా మానిచంద్రుఁ డర్ధరాత్రమున గాఢాంధకారములో దూరముగానున్న యా మిట్టమీఁదికి నొంటరిగాఁ జనెను. భూతప్రేతాది భీతియు సర్ప వృశ్చికాది భయమును నా తాపసోత్తమునకు లేవుగాబోలు.

రాత్రి రెండుజాములు గడచెను. సాయణాచార్యుల సాహాయ్యమున నిచట హరిహరాదులు కన్నులు దెఱచుకొని చూచుచుండిరి. గడియగడియకు వారి మనస్సులలో నుత్కంఠ హెచ్చుచుండెను. సీసమును గరఁగించి సిద్ధము చేసిరి. అచటఁ గొండమీఁద విద్యారణ్యులు వేయికన్నులతోఁ గనిపెట్టి యుండెను. నిముస నిముసమునకు నింగిఁ జూచుచుండెను. నక్షత్రములఁ బరిశీలించెను. దన నిర్ణీతకాలమున కొక రెండు గడియల వ్యవధి యున్నది. విధివిలసితమట్లున్నది. ఇంతలోఁ జెంత బోయపల్లెలో నివసించు నొక జంగమయ్య యప్పటి కప్పుడే దూరగ్రామములో బిచ్చమెత్తుకొనుటకు బయలు

దేజెను. తన వెడలుటకుఁ జిహ్నముగా శంఖమును భోరుమని పూరించెను. శంఖధ్వని వినుటతోడనే విద్యారణ్యుల గుండె ఝల్లుమన్నది. ఉత్సాహ ప్రవాహమంతయు నొక్కసారి యింకిపోయెను. మనస్సు వికావికలయ్యెను. అరే! ఇదియే నిశ్చయమనుకొని యచట సాయణాదులు శంకుఫలకమును బోయరుగదా! ఏమో యేమి గుర్తు సమయమిదే యనుకొన రాదా? ఎవ్వడీ కార్యఘాతుకుఁడు? గూఢశత్రువు? మహా ప్రయత్నమును భంగమొనరించెనే" యని మౌని మానసమునఁ జింతాకోపములు ముప్పిరిగొనెను. కింకర్తవ్యతా మూఢుఁడై యారాటపడెను. కాని యేమి సేయును. పోనిమ్ము. భగవదిచ్ఛ యని యొకదిటవునఁ బడెను. భగ్నమానసము మాత్రము బాధించుచునే యుండెను. ఇచట శంఖారావము వినవచ్చుట తోడనే రాజాదులు పోయెఁబోయెననిరి. సాయణాచార్యులు సంశయించెను. తన గణనా ప్రకారమింక సుమారు గడియ స్నరయైనను వ్యవధి యున్నది. ఏమిది! యప్పుడే మ్రోగినది శంఖమని యాలోచించెను. తానే పొరపడెనేమో యను కొనెను. ఊరకుండిన నన్నగారు వచ్చి యేమనునో యని భయపడెను. హరిహరాదులును శిష్యులును ద్వరపెట్టఁ జొచ్చిరి. చేయునదిలేక సమ్మతించెను. భార్యాసహితుఁడైన హరిహరరాయలతో ఫలకమును బోయించెను. ఒక మహా కార్యమును సాధించినట్లు వారెల్ల రానందించిరి. నెమ్మదిపడిరి. రెండుగడియలు గడచిన తరువాత మరల శంఖధ్వని వీతెంచెను. వినుటతోడనే సాయణుఁడు "చచ్చితిమి పో"మ్మనెను. రాజ

కుటుంబము నిర్వేరపడెను. ఇది సరియైన కాలము. అన్నగా రొనర్చిన శంఖనాద మిది. పొరపడి కార్యముఁ జెఱచితిమి. స్వామి వచ్చి యేమనునోయని సాయణుఁడు తన బుద్ధిప్రమాదమునకుఁ దానే నొచ్చుకొనెను. హరిహరరాయలును బుక్కరాయలును దిగాలునఁ గూలఁబడిరి.

విద్యారణ్యులు తహతహతోఁ గొండ దిగెను. సాయణుని బుద్ధివైభవమును దలంచుకొని మధ్యమధ్య నూరటపడుచున్నను మానసమునకు స్వాస్థ్యము చిక్కలేదు. వచ్చిన తోడనే సాయణా! ఏమి చేసితివని ప్రశ్నించెను. సాయణుఁ డవనతవదనముతో "స్వామిసంకల్పద్రోహులమైతి" మని మెల్లన నన్నపాదముల వ్రాలెను. ఏమి మొదటి శంఖధ్వనికే కార్యమును బూరించితిరా? అయ్యో! నిన్నుంచిపోయిన దెందులకు? ఇంతమాత్ర మాలోచింపలేకపోతివా? దైవసంకల్పమింతకు నిట్లున్నది యని తపసి విచారపడెను. తెల్లవాఱెను. కార్యనిర్వహణమున నెల్లరు మగ్నులైరి. సాయణునితోఁ దుంగభద్రవైపునకు విద్యారణ్యస్వామి నడచెను. ప్రాతస్సవనము నెఱవేర్చుకొని వచ్చి శంకు ఫలకమును నిరీక్షించి పెదవి విఱిచెను. ఫలకము బీటువాఱి యున్నది. "సామ్రాజ్యము సుస్థిరము మాత్రము కాదు. మఱి చేయునది లేదు. పట్టణము నిర్మింపు"మని హరిహరరాయల కాదేశించి యా మానిసత్తముఁడు తమ్ముఁడు వెంటరా శిష్యబృందముతో నాశ్రమమునకు వెడలిపోయెను.

పట్టణము నిర్మింపఁబడెను. పూర్వపశ్చిమదిశలయందుఁ

గృష్ణశిలాపర్వత మాలికలు, దక్షిణ దిక్కున రామదుర్గమను గుట్టలును గలవు. ఉత్తరదిశను గొన్ని గిరిపంక్తులున్నవి. వాని నంటుకొని తుంగభద్రా నదియుఁ బ్రవహించుచుండెను. ఇట్లు సహజ పర్వతదుర్గమైన యీ నగరము శత్రువులకు దుర్నిరీక్ష్యమై వెలుఁగొందెను. విద్యారణ్యులచేఁ బ్రతిష్ఠింపఁబడిన దగుట విద్యానగర మను నామమిడిరి. క్రీస్తు శకము 1336 వ సంవత్సరమున నిట్లు స్థాపింపఁబడిన యీ రాజధానిని పదునేనవ శతాబ్దము చివరివఱకు హరిహర రాయల వంశమువారే పాలించిరి. పిదప వీరి సామంతరాజగు సాళువ నరసరాజీ సామ్రాజ్యము నాక్రమించుకొనెను. ఆ వెనుక నెట్లయిన నేమి తుళువవంశమునకు సంక్రమించిన దీ రాజ్యము. తుళువవంశజులలో వీరనరసింహరాయల యనంతరము సింహాసన మధిష్ఠించిన మహాప్రభువు కృష్ణదేవరాయలు. విజయనగర సామ్రాజ్యమును గృష్ణానది మొదలు కన్యాకుమారివఱకు విస్తరింపఁజేసి యేకాతపత్రముగఁ బరిపాలించిన మేటి శూరుఁడితఁడు. జీవితమునఁ బరాజయ మనునది యెఱుంగఁడు. యవనాక్రాంతములైన పెక్కు హిందూరాజ్యముల జయించి వశపఱచుకొనెను. ఎనలేని కళాభిమాని, స్వయముగాఁ బండితుఁడు. ఈ రాజచంద్రుని చేతిచలువవలననే యాంధ్ర కవితాసతి వన్నె చిన్నెలు గన్నది. ఇంతకుఁ జెప్పవచ్చిన దేమన: వైశాఖశుద్ధ పంచమి నాఁడు విద్యానగరము ప్రతిష్ఠింపఁబడుటవలన సామ్రాజ్యప్రభువులు ప్రతిసంవత్సర మా దినము మొదలుకొని కొన్ని రోజులు నగరోత్సవములని చేయుచునే వచ్చిరి. రాయలు

సింహాసన మధిష్ఠించినది మొదలు నగరోత్సవము లను పేరు వోయి వసంతోత్సవములని వ్యవహరింపఁబడెను. ఉత్సవ దినములలో సమస్త దేశములనుండి కవులఁ బండితుల, గాయనుల, వివిధ కళోపాసకుల నా మహాప్రభువు సాదరముగాఁ బిలిపించును. వారివారి నైపుణములఁగాంచి యానందించును. చివరకు వారికెల్ల నేనుఁగు పాడిగా నిష్టార్థము లొసఁగి సత్కరించును. నెఱదాతయైన యా రాజన్యుని వసంతోత్సవ క్రమ మిది.

3

తుంగభద్రానది యొడ్డుననే యున్నది పెద్దన్నగారిమేడ. చుట్టును బెద్ద ప్రాతిప్రాకారములోపలఁ గొబ్బరిచెట్లు, పోక వృక్షములు చూచుట కాకర్షకముగానే యుండును. మేడ మీఁది కెక్కి చూచిన నదిని దాఁటుచున్న పాంథులు, జల తరంగములు, పులినభూములు నింపుగాఁ గనుపట్టుచుండును. నగరోద్యానముల మీఁదుగా వచ్చు చల్లగాలికిఁ గొదువలేదు. ప్రశాంతమైన యచ్చోటికి కేగిన మరలఁ దిరిగి రా బుద్ధిపుట్టదు. రెండుమూఁడు సంవత్సరముల క్రిందటి వఱకును బెద్దనామాత్యునిది సామాన్యమైన పూరియిల్లే. ఒక దినమునఁ గృష్ణరాయలు కొలువుండి ప్రసంగవశమున నల్లసానివారిని బద్యము లేవియో చెప్పుమని కోరెను. అంత నా కవి శేఖరుఁడు—

"నిరుపహతి స్థలంబు రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మకింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకిన(గాక యూరక కృతుల్ రచియింపుమ(టన్న సాధ్యమే."

అని తన యభిలాష మెఱి(గించెను. సామాన్యముగా( గవులు భోగలాలసులుగానే యుందురు. వారికి మొగమోటమి యను నది యుండదు. రసజ్ఞులు తప్ప నితరులు బ్రహ్మాంతవారైనను వారిదృష్టిలో నొక గడ్డిపరక. అరసికులు వారినట్లే చూతురు గాక. సహృదయుల మానసములందు మాత్రము వారిస్థానము పెద్దది. అది చాలును వారి యాత్మతృప్తికి. ఇంట( దిండికి లేకపోయినను నభిమానము మాత్ర మించుక చావదు. పెద్దన గారి యా మాటకు నా విద్వత్ప్రభుు(డు నవ్వెను. వెంటనే శృంగారమైన యొక సౌధము గట్టించి తగు వసతులన్నియు( గల్పించెను. ఇపుడా కవిసత్తముని యింట భోగవస్తువులకు( గొఱంత లేదు. కుర్చీలు, బల్లలు, రత్నకంబళములు మొదలైన విలాససామగ్రి సమృద్ధిగా( గలదు. చూచుట కొక చిన్న సామంతరాజు భవనమువలె( గానిపించును.

నందవరీక బ్రాహ్మణు(డైనను బెద్దన వైష్ణవము స్వీక రించెను. ఊర్ధ్వపుండ్రములు ధరించును. అనుదిన మష్టాక్షరీ జపము గావించును. దివ్య ప్రబంధ పారాయణము సేయును. ఈ విషయములలో( గవియు( బ్రభువును దుల్యులే. ఇద్దఱికిని శఠకోప యతీంద్రు లాచార్యులు.

ప్రతిదినము సాయంకాల మొంటిగంట ప్రాంతమున

శిష్యులు పాఠములకై పెద్దనామాత్యునియింటి కరుదెంతురు. శిష్యులయందెల్ల నెన్నఁదగినవాఁడు భట్టుమూర్తి. అతఁడన్న నాంధ్రకవితాపితామహునకును నభిమానమే. పాఠములన్నియుఁ జెప్పి కవివతంసుఁడు కొలువున కేగును. ఆనాఁడు శిష్యులెవరును రాలేదు. పెద్దన మనస్సు వికలముగానున్నది. కారణము కుమారుఁడైన సూరనయే. పాపమా యర్భకుని యందు బండిత పుత్రుఁడన్నమాట యథార్థముగా నన్వయించినది. విద్యాగ్రహణశక్తి తక్కువ. శ్రద్ధయును నంతటిదే. పట్టుమని యొకగంట కూర్చుండి చదువఁడు. పెద్దనగారింటి యొద్ద నున్నంతకాలము బలవంతమున నెట్లో పుస్తకము పట్టుకొని యుండును. ఆయన యే పనిమీఁదనైనను గడప దాఁటుట యాలస్యము. ఇఁక విజయనగర వీథులయందెచటఁ జూచినను సూరనయే. ఇతర బాలకులఁ గొట్టును. ఇండ్లలో దూరి దొరకినవి దొంగిలించును. చిన్న పెద్ద తారతమ్యము లేక బూతులు తిట్టును. విద్యాపాండిత్య మబ్బకపోయినను బూతులయందు మాత్రము సూరన కపార పాండిత్యము లభించినది. పెద్దనగారిమీఁది గౌరవమువలనఁ గొంద ఱాతని దుండగముల సహింతురు. మోరకులు వెంటనే పెద్దనగారింటి మీఁదికి దండెత్తుదురు. కవితా మాధుర్యములతో వారికేమి పని? సూరనను జూచినపుడెల్ల నగర ప్రజలు విచారపడుదురు. ఆ విచార మాతని కిసుమంతకూడ వంత గలిగింపదు. ప్రతి రోజు కనీస మొకటి రెండైనను సూరన వలని జగడములు పెద్దనగారి కడకు వచ్చుచుండును. ఈ యమానుషమున కా

కవిచంద్రుని మానసమెల్లప్పుడు వుండగుచునే యున్నది. కుమారుని యీ యల్లరి తగ్గుటకును విద్య గఱపుటకును నా బ్రాహ్మణుఁడు పెక్కు బాములు పడెను. తిట్టెను. కఠినముగాఁ గొట్టెను. ఎన్ని చేసిన నేమి లాభము? ప్రకృతిసిద్ధగుణము నెవఁడు మాన్పును. ఆ పిల్లవాని కిపు డిరువది సంవత్సరములు సమీపించినవి. విద్య వచ్చుననెడి యాశ యెప్పుడో పోయి నను వయసు వచ్చినకొలఁది యల్లరియైనను దగ్గునేమో యను నాస పెద్దనగారి కుండెడిది. అదియుఁ గ్రమక్రమముగా క్షీణించెను. వయస్సుతోఁబాటు దుండగములు హెచ్చినవే గాని తగ్గలేదు. తనంతవాఁడైన కుమారు నిపుడు పెద్దన యెట్లు శిక్షింపఁగలఁడు. అతనిఁ జూచినపుడెల్ల నా మహాకవికి దుఃఖము వచ్చును. ఇంతేగాక యతనిమూలమున గృహకల్లోలములు కూడ సాగెను.

పెద్దనగారి భార్య లక్ష్మీలలితమ్మ. కుమార్తె సుహాసిని. లలితమ్మగారు రల్లసానివారికిఁ దగిన పత్ని. ఆ యిల్లాలు భర్త మనస్సెన కన్యథాచరించి యెఱుఁగదు. గుణసంపన్న యేకాక రూపవతికూడను. సుహాసిని మంచి చుఱుకైనపిల్ల. ఆ బాల తండ్రిగారికడ సంస్కృతాంధ్రములఁ జక్కగా నభ్యసించెను. కొలఁదిగాఁ గవిత్వముకూడఁ జెప్పఁగలదు. ఆ పరిశుద్ధ కుటుంబ మెల్లరకు ముద్దుగొల్పుచుండెను. రాజాశ్రయము లభించినదాది వారి కేవిషయములయందును బాధపడవలసిన పనిలేదు. ఇట్లు సుఖజీవనము నెఱపుచున్న యా మహాకవిని దైవము పుత్రరూపమున వంచించెను. ఈడువచ్చిన కుమా

రునిఁ దండ్రి కఠోరముగా దండించుట చూచి లలితమ్మగారోర్వలేకపోయెను. మాతృప్రేమ యామె గర్భము దహింపసాగెను. సహింపలేక యామె పెద్దనగారి కడ్డువచ్చుటయు, నంతట నామెనుగూడఁ గసరుటయు దానితో రెండుమూడు రోజు లొకరితో నొకరు మాట్లాడకుండుటయు సంభవించుచుండెను.

క్రిందటి దినమున నొక గల్లంతు జరిగెను. నగరమున మందపాలుఁడను నొక కోమటిగలఁడు. అతనిది చిన్న మిఠాయి దుకాణము. సూరన యప్పుడప్పుడు పోయి యా దుకాణమునఁ గూర్చుండు వాడుక గలదు. పాప మా కోమటి యూరకుండలేక "అబ్బాయీ! మహాకవి గర్భమునఁ బుట్టితివి గదా యిట్లు వీధులవెంట నల్లరిగాఁ దిరిగిన నేమివచ్చును? చక్కగాఁ జదువుకొనరాదా" యనెను. వెంటనే సూరనకును వర్తకునకును జేతులు గలియునంతటి పనియైనది. చుట్టుపట్టులవారు 'సరిదిరి.' ఆ క్రోధము మనస్సులో నుంచుకొని సందెవేళ మఱి యిద్దఱిని గలుపుకొని పెద్దనకుమారుఁడు మందపాలుని దుకాణముమీఁద దాడిచేసెను. అంగడిలోని సరకులన్నియు దోచుకొనిరి. అడ్డువచ్చిన కోమటిని నతని భార్యనుగూడఁ జావమోదిరి. మందపాలుఁడు పెద్దనగారి కడకువచ్చి వృత్తాంతముచెప్పి ఘోషించెను. ఆయనమాత్ర మేమిసేయును! "ఛీ. వెధవ. వీఁడు చచ్చినను బాగుండును. వీని వలన నూరఁ దలయెత్తుకొను పారములేదు. సరే యింటికి రానిమ్ము వానిపని పట్టించెద"నని వర్తకు ననునయించి

పంపెను. గోడచాటుననుండి వినిన సూరన పలాయనము చేసెను. నాఁటిరాత్రి యింటికి రాలేదు. రెండవనాఁడును రాలేదు. అందువలనఁ బెద్దనగారి హృదయము కలవరముగా నుండెను. కొలువున కేగుటకు మనస్కరింపలేదు. మేడమీఁదఁ బరుండి యేమేమో యాలోచించు చుండెను. ఇంతలో సుహాసినివచ్చి నాన్నగారూ! చారుదత్తుఁడు వచ్చెనని చెప్పగా లోపలికి రమ్మనుమనెను.

చారుదత్తుఁడు లోనికివచ్చి యాంధ్రకవితా పితామహునకు నమస్కరించెను.

చారుదత్తా! ఏమి విశేషములు?

ఆర్యులను వెంటనే ప్రభువులు పిలుచుకొని రమ్మనిరి.

ఏమో యంతటి యవసరము?

బాబూ! మా కేమి దెలియును. మహారాజుగారి యానతిఁ దెలియఁ బఱచితిని. పైని మీ చిత్తము.

సరే వచ్చుచుంటినని చెప్పుము.

చారుదత్తుఁడు వెడలిపోయెను. పెద్దన్నగారు భార్యను బిలిచి "మన సూరన్న దివ్యచరిత్రము ప్రభువుదగ్గఱకుఁగూడఁ బోయెను గాబోలు. పిలువనంపెను. ఈ తల యెచటఁ బెట్టుకొనవలయునో తెలియకున్నది. వీనివలన నాకుఁ జచ్చెడి యోగమున్నది" అని విసిగికొని మేడదిగి కొలువుకూటము వైపునకు సాగెను.

# ౪

కృష్ణదేవరాయలు రత్న సింహాసనమున నాసీనుఁడై యుండెను. ఆజానుబాహువులు, విశాలమైన ఫాలము నా రాజన్యుని మహాపూరుషత్వమును సూచించుచుండెను. ఆకర్ణాంతములైన వెడఁద నేత్రములు కొట్టవచ్చినట్లున్నవి. ముత్యాల కుచ్చుల పాగా, మీసములు, ముఖమునకు నూత్నశోభ నిచ్చుచున్నవి. శాంత గంభీరమైన యా మొగ మెంతసేపు చూచినను దనివితీఱదు. ఆ మహారాజు ప్రక్కను నొక యున్నతాసనమున నరసిన గడ్డముతో వృద్ధామాత్యుఁడు తిమ్మరుసు కూర్చుండియుండెను. తిమ్మనాది కవు లొకవంకను, సామంత, దండనాధాదు లొక క్రేవను నర్హాసనముల నుండిరి. సార్వభౌముని యల్లుఁడు రామరా జొక పీఠము నలంకరించెను. వందిమాగధాదులును ప్రజానీకమును సభ నిండియుండిరి. ఇరువురు యువతులు చక్రవర్తికిఁ జామరములు వేయుచుండిరి. పెద్దనగారిని జూచినంతటనే ప్రభువు కన్నులు చెమర్చినవి. "మహాకవుల రాక నేఁ డేలకో యాలస్యమైనదే" యనెను. "ఏమియులేదు. కొంచెము బద్ధకముగా నున్నదండీ" యని పెద్దనామాత్యుఁడు తన యాసనముఁ జేరెను. సభయంతయుఁ గొలఁదిసేపు నిశ్శబ్దముగా నుండెను. పిమ్మటఁ గృష్ణరాయలు వృద్ధామాత్యుని వంకఁ జూచెను. ఆ వృద్ధుఁడు మెల్లగా లేచి నిలఁబడి గొంతు సవరించుకొని యిట్లుపన్యసించెను.

'సభ్యులారా! నేఁడొక విశేషము మీ కెల్లరకు నెఱిఁగింపఁ గలిగినందుల కెంతయు నానందించుచున్నాఁడ. మహరాజుగారి యౌదార్యము, పరాక్రమము, ఉత్సాహశక్తి, విద్యాభిమానము మీ రెఱుంగనియవి కావు. ఈ సార్వభౌముని వలన నాంధ్రకర్ణాటక రాజ్యములు రాజన్వంతములైనవి. ప్రభువులవారిని గుఱించి విశేషముగా నేను జెప్పవలసిన పని లేదు. ముంజేతి కంకణమున కద్ద మవసరము లేదుగదా. ఇట్టి రాజచంద్రుని సమక్షముననుండి యీ వైభవమున భాగస్వాముల మగుటవలన మన మందఱము ధన్యులమే. మహారాజులుంగారు ప్రతిసంవత్సరము వసంతోత్సవములు నెరపుట వివిధ రంగముల నుండి కళారాధకుల రావించి సత్కరించుట మున్నగు విషయములు మన కనుభూతములే. వైశాఖశుద్ధ పంచమి సమీపించుచున్నది. ఇప్పటినుండి ప్రయత్నములు జరిగినఁగాని కార్యము శోభగా జరుగదు. దానిలోఁ బాల్గొని జయప్రదముగాఁ జేయవలసిన భారము మీ యందఱిమీఁద నున్నది. సమర్థులైనవారు పెక్కురు చేరినఁగాని యే కార్యమైనను రాణింపదు. గౌరవముకూడ నప్పుడే. ఉత్సవములలోఁ గార్యక్రమము కావలసినంత యున్నది. ఒకొక శాఖకు సమర్థులైనవా రొకొక్కరుగాఁ బాలకవర్గ మేర్పడి సహస్రనేత్రములతోఁ గనిపెట్టియుండినఁగాని లోపములు లేకుండఁ జేయలేము. ప్రభువుల యనుమతిప్రకార మిప్పుడే పాలక సంఘమును నిర్ణయించుచున్నాము. అనంతరము మీ మానము నంగీకారముగా భావించెదము.

'మొదటిది యాహ్వానశాఖ. వివిధదేశస్థులైన సామంత రాజులను గౌరవార్హులైన పెద్దమనుష్యులను బిలిపించుట, వచ్చినవారికెల్లఁ దగువసతులు గల్పించుట, భోజనపానాదుల నాలోచించుట మున్నగు విషయము లీ శాఖవారు చేయవలసిన పనులు. దీని కధ్యక్షులుగాఁ జిరంజీవులు శ్రీయళియ రామరాజుగారిని నిర్ణయించుచున్నాము. మహారాజులుంగారి స్థానే వారి యల్లుఁడుగా రీవిషయములు చూచుట యెంతయు సమంజసముగా నుండును.

'రెండవది నియమనశాఖ. ఉత్సవముఁ జూడవచ్చిన మహాజనమును జక్కఁగా 'సర్ద' వలయును. ఒకరినొకరు త్రోపాడకుండ, నలజడులు జరుగకుండఁ జూడవలయును. ఉత్సవశోభయంతయు నీ శాఖమీఁదనే యాధారపడియుండును. దీనికిఁ దగినవాఁ డుగ్రశాసనుఁడైన మహాసేనాని మన నాగమనాయఁడు. ఇంక నర్హులు మఱియొకరు లేరు.

'మూఁడవది కవితాశాఖ. మహాకవుల రావించుట, సభాకార్యక్రమము నిర్ణయించుట, యర్హతనుబట్టి కార్యక్రమమునఁ బాల్గొనఁజేయుట. ఈ స్థానమునకర్హుఁడు ఆంధ్ర కవితాపితామహుఁడని నేను వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

'నాలుగవది గానశాఖ. గాయనీ గాయనులచే నర్హకాలముల సంగీతసభలు జరిపించుట. దీనిని నిర్వహింపఁ దగినవాఁడు మణిమంతుఁడు.

'ఐదవది పౌరాణికశాఖ. పురాణములు, ఉపన్యాసములు, హరికథలు జరిపించుట దీనియం దంతర్భవించి

యుండును. దీని కధ్యక్షులుగా నుండ నంది తిమ్మనగారిని బ్రార్థించుచున్నాము.

'ఆఱవది నాట్యశాఖ. నాటక ప్రదర్శనములు, భరత నాట్యములు దీని యవాంతర భేదములు. ఈశాఖకుఁ గళానిధి యైన పుష్పదత్తుఁ డధ్యక్షుఁడుగా నున్న బాగని మాతలంపు.

ఇట్లా మహామాత్యుఁడు కావలసిన శాఖా విభజన మంతయుఁ జేసి యధ్యక్షవర్గమును నియమించి మఱియు నిట్లనియెను. 'ఆర్యులారా! ఇంచుమించుగాఁ బాలకవర్గ మంతయు నేర్పడినయట్లే. ఇఁక మిగిలినది సన్మానశాఖ. ఉత్స వాంతమున, వివిధరంగముల యందలి విద్వాంసుల సత్క రించుట. దీని కధ్యక్షులుగా మహాప్రభువులను నియమించు చున్నాము. సాహసించి నియమించినందులకు క్షమింప వేఁడు చున్నాము. మఱియు నీ మహాకార్యమున యథాశక్తి సాహాయ్య మొనరించి జయప్రదముఁ జేయుటకు సభాస్తారుల కందఱికి నంజలిఘటించి యింతటితో నా యీ యుపన్యాస మును ముగించుచున్నాఁడను.

ఉపన్యాసమును ముగించి యమాత్యవరుఁడు తన యాసనమునఁ గూరుచుండఁ బడెను. పిదపఁ గృష్ణరాయలు లేచి గంభీరస్వరముతో నిట్లనెను. 'పూజ్యులారా! అప్పాజీ యుపన్యాసమును వింటిరిగదా. వారి పాలకవిభజన మెంతయు సర్వమముగానున్నది. అట్టి మహామాత్యులబుద్ధి వైభవమండగా నుండుటవలన నెంతెంత కార్యములైన సులువుగా సాధించు చున్నాము. వారి విషయమై చిన్న విన్నపము. 'ఈ మహాకార్య

మంతయు సర్వనిర్వాహక కార్యదర్శిగానుండి నెరవేర్పుమని వారిని సవినయముగాఁ బ్రార్థించుచున్నాము.'

అని ప్రభువు చెప్పినంతనే సభాజనులు కరతాళములు గావించి జయ జయధ్వనులు సేసిరి. మరల బ్రభువిట్లు వచించెను. 'ఈ సంవత్సరము, అర్హతనుబట్టి గండపెండారముతో గౌరవించి యొక మహాకవికి గజారోహణ, కనకాభిషేక సన్మానములు జరుపవలయునని యున్నది. ఇంతకుమించి దీని విశదము లిప్పుడేమియుఁ జెప్పఁబడవు. రేఁపటినుండియు వారి వారి కార్యక్రమము నారంభించి చులుకుగా సిద్ధముచేయుఁ డని యొకసారి సభ్యుల హెచ్చరించుచున్నాను.'

అని, యా రాజపుంగవుఁడు నాఁటికొలువు చాలించెను. సభాభవనము వెలువడి యెవరియిండ్లకు వారు వోయిరి.

౫

రాత్రి యైదుగడియల ప్రొద్దువోయినది. అప్పుడే రాజభవన ప్రాంగణమున నైదుగంటలు మ్రోగినవి. అప్పటికి వ్యాయామము నాచరించి దేవపూజ ముగించుకొని కృష్ణదేవరాయలు భోజనమున కేగెను. భోజనము చేసినంతసేపును నవసరములేనివి పరిహరించుచుఁ గావలసినవి వడ్డించుచుఁ దిరుమలదేవి దగ్గఱ నిలఁబడి యుండెను. బయట హంసతూలికాతల్పము నన్నపూర్ణాదేవి సరిచేయుచుండెను. ఇట్టి పనులన్నియు వారికి దాసీగణమే చేసినను బ్రభువునకుమాత్ర మా రాణులే స్వయముగాఁ జేయుదురు. అప్పటి కింకఁ బరిచారిక లందఱును నిండ్లకుఁ బోలేదు. ఒకరిద్దఱు పాలరాతి

స్తంభములచాటునఁ గ్రీనీడలలోఁ బరుండి గుఱ్ఱుపెట్టుచునే యుండిరి. ఇంతలో నొక చెలికత్తె వెంట రా మహారాజు కుమార్తె తిరుమలాంబ వచ్చినది. పుత్రులైనను బుత్రిక లైనను గృష్ణరాయల కామె యొక్కటియే. ఆమెయు మంచి విదుషి, రూపవతి. అందువలనఁ బ్రభువున కాబిడయందుఁ బ్రేమ మెక్కువ. భోజనానంతరము ప్రతిదినమును రాత్రుల యందుఁ దిరుమలాంబ తండ్రిగారిని దర్శింప వచ్చును. కొంత సేపు కుమార్తెతో మాట్లాడినఁగాని తండ్రిగారికిఁ దృప్తి లేదు. సందెవేళల నవాంతరమేదియైనను వచ్చినఁ దప్పఁ దప్పక యనుదినమును రాణులును బ్రభువును గుమార్తెయుఁ గొంతవడి యిష్టాగోష్ఠి సేయుదురు. ఆ పైనిఁగాని పరుండరు.

తిరుమలదేవి యొక పీఠమునఁ గూర్చుండి కృష్ణరాయ లకుఁ దాంబూల మందించుచుండెను. ఎదురుగా నొక యాస నమున నన్నపూర్ణాదేవి కూరుచుండెను. తెల్లని చామరముతోఁ దిరుమలాంబ విసరుచున్నది. కొంతవడి యేదియో ప్రసంగమైన తరువాతఁ గుమార్తె ప్రశ్నించినది. 'తండ్రీ! రేఁపు చెప్పెద మంటిరే యుత్సవముల సంగతి రాత్రి; యేమైనది'? అని. అనిన నాఁటి సభావృత్తాంతమంతయు రాయలు చెప్పుచుండెను. వినుచున్న యన్నపూర్ణాదేవి యడ్డువచ్చినది.

ఆర్యు లింతంత ధనము వ్యయించి యీ యుత్సవములు నెరపుటవలని ప్రయోజన మేమో వినవచ్చునా?

కృ: ముఖ్యముగా వినవలెను. కవితాసభల వలనను, నుపన్యా సములు మొదలైనవాని వలనను, శ్రోతల కానందము,

చేసిన సత్కారముల వలనఁ జెప్పినవారి కింత జీవనభృతి, కళారాధనమునందు మఱింత యుత్సాహము, భాషాభివృద్ధి, ఒకటేమిటి యనంత ప్రయోజనము లున్నవి. ప్రతి మనుష్యుఁడును గళాభివృద్ధికై ప్రయత్నింపవలెను.

అన్న: కళలన్నియు సమానమేగదా! వాని నన్నింటిని బోషింపవలయును. మఱి ప్రభువులు కవితా విషయములో ఖర్చుపెట్టినంత మిగిలినవాని విషయమై వ్యయించుట లేదే. పోయిన సంవత్సరమే చూడుఁడు. ఒక్క కవుల కొనర్చిన సత్కారములో సగమున్నదేమో మిగిలిన విద్వజ్జనులకొనర్చిన సన్మానమంతయు. ఆర్యుల కిది పక్షపాతము గాదా?

"ఇదియా నీ సందేహము" అని రాయలువారేదో చెప్పఁబోవుచుండిరి. ఇంతలోఁ దిరుమలాంబ యందుకొని, అమ్మా! కళలన్నియు సమానమెట్లగును. పుష్పజాతి యొక్కటేయైనను వానిలో భేదములేదా. కొన్ని పరిమళయుక్తములై మానసాహ్లాదము నొసఁగుచున్నవి. కొన్నిటికి వాసనయే యుండదు. కొన్ని వెగటువాసనగొట్టును. పరిమళమును బట్టి వానికి గౌరవమేర్పడుచున్నది. కళల విషయముగూడ నంతే. అఱువదినాలుగు కళలలో సాహితీ సంగీతములు ముఖ్యములైనవి.'

అన్న: అయిన గాయనులకైనను గవులతోఁ బాటు సమముగా సమ్మానము జరుగ వలయునుగదా!

తి: వానిలోగూడఁ దారతమ్యము లేకపోలేదు. సంగీత

మాపాతమధురము. శ్రోతలకానందము కలిగించును. మనః కాలుష్యము పోఁగొట్టును. ఉత్సాహమిచ్చును. ఆ యానందము శాశ్వతముకాదు. తాత్కాలికము మాత్రమే. ఇఁక సాహితి యట్టిదికాదు. దానిని మథించినకొలఁది నమృతము బుట్టుచునేయుండును. కవితారసపాన తత్పరుల కితరము రుచింపదు. కవులు లేనినాఁడు ప్రపంచమేలేదు. అంధకారావృతమై పోవును. కవిత్వ మొక మహాజ్యోతి. దాని వెలుఁగుననే సర్వ వ్యవహారములు నడచుచున్నవి. ఎవ్వఁడేని యొక జ్ఞానలవమును సంపాదించిన నదియెట్లు కలిగినది? గ్రంథములవలన. నవి యెవరివి? మహాకవుల సొత్తుగదా. ప్రభువు దేశమును బరిపాలించుచున్నాఁడన్న నతనికాధారమేమి? కవితామూలకములైన శాస్త్రములే లేకున్న నెవని కేశిక్ష విధించును. అసలు శిక్షింపఁబడవలసినవాఁ డెవఁడు? రక్షింపఁబడవలసినవాఁ డెవఁడు? దీని నెట్లు తెలిసికొనును? ఏ యుద్యోగమునకు నర్హుఁడైనను దానికి వానివిద్య కారణముగదా. విద్యయెట్లు వచ్చును? చదువుటచేత. కవులు పుస్తకములు వ్రాయకున్న నేమి చదువును? వాల్మీకి రామాయణము వ్రాయఁబట్టి రామగాథ చదివి యానందపడుచున్నాము. నాఁటి విషయములు తెలిసికొనుచున్నాము. వేల సంవత్సరముల క్రిందట మన పూర్వు లెట్లున్నది తెలియవచ్చుచున్నది. మఱి పెక్కు సద్విషయములు బోధపడుచున్నవి. మహాకవి తన నైపుణమునఁ బ్రౌఢవిషయమును దేలికగా మనస్సుల కెక్కించును.

నూతన విశ్వమును సృష్టించి కనులముందుఁ బెట్టును. సదాచారములను మెలకువగా నేర్పి దేశమునుద్ధరించి తన కవితాగానముచే నష్టప్రాయమైన జాతిని మేలుకొల్పును. కవితకుసాటి మఱియొకటి లేదు. కవులార్షాంశ సంభూతులు. కవితాభిమానము లేనివాఁడు నిశ్చయముగాఁ గృతఘ్నుఁడు.'

అన్న:- ఆ తానులోనిదిగాదా యాముక్క యన్నట్లు నీవు మాత్రము కవివిగావా. అందుచే నిట్లు చెప్పుచున్నావు. ఇతర కళలయందు లేక యొక్క కవితయందే యిన్ని ప్రయోజనము లున్నవనిన నెవ్వరు నమ్ముదురు ?

అంతఁ దిరుమలదేవి "ఏల యీ వాదోపవాదములు. వారివారి యభిమానమన్న నొక్కమాటతో సరిపోవును" అన్నది. అందఱును ఫక్కున నవ్విరి. గాజుదీపములకాంతిలోఁ దిరుమలాంబ తన శయనాగారమునకు వెడలిపోయెను.

## ౬

ఉత్సవకార్యములు శరవేగముగా జరిగిపోవుచుండెను. నగరవాసు లిండ్లకు సున్నములు గొట్టించుకొనిరి. ముంగిళ్ల యందు వింతవింత ముగ్గులు రచించిరి. వీధు లలంకరించిరి. అటనట పచ్చని యాకుఁదోరణములు గట్టఁబడెను. వర్తకుల యంగడులు పూర్వమునకంటె రెట్టింపు సరకులతో నింపఁబడినవి. ఉత్సవసమయమున ధరించుటకు మంచిమంచి చీరలు, అవికెలు గొనితెమ్మని వనితలు మగవారినిఁ బీడించుచుండిరి.

సామంతరాజు లేనుంగులతోఁ, గుఱ్ఱములతోఁ బరివార ములతో రాసాగిరి. కృష్ణరాయల సవతితమ్ముఁడగు నచ్యుత రాయల సాహాయ్యముతో నళియరామరాజు వసతులు మున్నగునవి వారికిఁ గల్పించుచుండెను. వచ్చెడి జనసమూ హాముషలనఁ బట్టణములో నద్దెలు హెచ్చిపోయినవి. భోజనాలయములలోఁగానీ యుపాహారశాలలోఁగానీ తావు దొరకుట దుర్లభమాయెను. వీధులలో నెచటఁ జూచినను రంగురంగుల పండిత శాటులుగప్పిన వ్యక్తులు గానిపింపఁ జొచ్చిరి. వారి దేదేశమో యేయూరో యెవ్వ రెఱుఁగుదురు.

పట్టణము మధ్య సభలు జరుపుటకై యొక బయలున మహా మంటపము నిర్మించిరి. వివిధములైన కాగితపుఁ బనుల తోడను, గాకిబంగారు సేఁతలతోఁడను, బాదరసపుగుండ్ల మేల్కట్లతోడను నా మంటపము నేత్రాభిరామముగా నుండెను. మహారాజునకుఁ బ్రత్యేకముగా నొక గద్దె నేర్పఱచిరి. దాని ప్రక్కనే మహావేదిక వక్తలకై నిర్మింపఁ బడినది. ఒక ప్రక్క సామంతరాజులకును, నొకవైపున విద్వజ్జనులకును నుచితాసనములు కల్పించిరి. రాజకాంత లకును స్త్రీజనమునకును గొంచెము దూరముగా స్థానము ప్రత్యేకింపఁబడినది. మిగిలిన ప్రదేశమంతయు మహాజనము నకు నిర్దేశింపఁబడినది. పంచమినాఁ డుత్సవములఁ బ్రారంభిం చిరి. ఆ వేళ మొదలగుటచేఁ జెప్పుకొనఁదగిన విశేష మేమియు లేదు. రాత్రికి మాత్ర మొక నాటక సమాజమువారు సత్య హరిశ్చంద్రీయము ప్రదర్శించిరి. నాయికా నాయక పాత్ర

ధారులు మంచి నేర్పరులు. పిన్నలు పెద్దలు ముదుసళులు తెల్లవాఱువఱకు తెప్ప వ్రాల్పలేదు. నాటకము మంచి రస వత్తరముగా నున్నది. రెండవ నాఁటినుండి సభలు ప్రారంభింపఁ బడినవి. మహాజనము రాక మితిమీఱిపోయెను. బేరగాండ్రు కాసీ సరకు నణాకు విక్రయింపసాగిరి. వేలకొలంది రక్షక భటులు పడి ప్రజలను బెదరించి సమ్మర్దము లేకుండఁ జేయు చుండిరి. ఉదయ మెనిమిది గంటలనుండి పండ్రెండు గంటల వఱకును మరల సాయంత్రము రెండుగంటలనుండి నాలుగింటి వఱకును గవితా సభలు జరుగును. పిమ్మట రాత్రి యెనిమి దింటికి గానసభలు ముగియును. ఆపైని నాటకములుగానీ హరికథలుగానీ జరుగును. రెండవనాఁటి యుదయము బట్టు మూర్తి యష్టావధానము నెరపెను. బాల్యమైనను నా మహా కవి వ్యస్తాక్షరి, సమస్యాపూరణము, వర్ణనము మున్నగునవి యత్యద్భుతముగా నిర్వహించెను. పండితులెల్లరు సాధువాద ములు చేసిరి. చింతలపూడి యెల్లనార్యుఁడు తన రాధా మాధవ కావ్యమును జదివెను. కృష్ణరాయలు సంతసించి యా కవికి రాధామాధవుఁ డను బిరుద మొసఁగెను. సాయంకాల మింకను బెక్కుమంది కవులు తమ తమ కవితా ప్రావీణ్యమును బ్రకటించిరి.

పురమునఁ బ్రజ లెచటఁ జూచినను గుంపులు గుంపు లుగాఁజేరి " ఆ కవి యాశువునఁ బద్యములు చక్కగాఁ జెప్పెను. ఆ పండితుని వాక్కు స్ఫుటముగా లేదు. 'ఫలానా' కవికి గాత్రశోభ లేదు. కాకున్న మఱెంత బాగుగా నుండెడిది.

ఆవేశము బాగుగనున్నది. ఆవిద్వాంసుఁడు రాగముఁ జక్కఁగా సుఖపఱచెను." ఇట్లు చెప్పుకొనుచుండిరి. నాల్గురోజులు కడచన్నవి. ఉత్సవములు మహావైభవముగా సాగిపోవుచున్నవి. నవమినాఁటి సాయంకాలము సభ ముగియఁ బోవునప్పుడు కృష్ణరాయప్రభువులేచి యిట్లు చెప్పెను. "సభ్యులారా! రేఁపు దశమి. ఒక మహాకవికి గండపెండార, గజారోహణ కనకాభిషేక సన్మానములు జరుపఁబడును. అవి యెవరికైనది నిశ్చయములేదు. దానికై యొక కవితాపరీక్ష నెఱపఁబడును. ఐదు నిమేషములు ముందుగా రేఁపు దాని వివరములు తెలియఁబఱచెదము. అందు గెలుపొందినవారి కా సన్మానము."

ఆరాత్రి కవులకు నిద్దురలేదు. మహారాజిచ్చు కవితా పరీక్షాశైలి యెట్లుండునని యనుమానింపసాగిరి. కొందఱు పద్మబంధ ఖడ్గబంధాదులు సిద్ధపఱచుకొనిరి. కొందఱు మహారాజుపైఁ బద్యములు వ్రాసికొనిరి. "ప్రభువుతప్పక ప్రేమపాత్రుఁడైన తిమ్మరుసుమహిమ వర్ణించు" మనునని యతనిని వర్ణించిరి కొందఱు. మఱికొందఱు పరీక్షాశైలి తమకేమో తెలిసినట్లు 'అది వేఱుగానున్నదిలే' యని గంభీరతలు ప్రకటించిరి. అట్టివారికడ నదియేమో పసిపట్టవలెనని కొందఱు మూఁగఁ జొచ్చిరి. "ఏమో! మనకేల యీబాధ. యదృష్టవంతుఁడెవఁడో వానికి సన్మానము జరుగును"అని నైరాశ్య మొందిరి కొందఱు.

తెల్లవాఱెను. సూర్యోదయ మగునప్పటికే మంటపస్థానమును బయటి ఖాళీప్రదేశమును మహాజనముతోఁ

క్రిక్కిరిసి పోయినది. పెక్కు సంత లేకమయినట్లు మహాధ్వని రేగినది. రక్షకభటు లెంత యదలించినను గోల యుపశమించుటలేదు. సామంత నరపాలురకును గవులకును లోనికేఁగుట దుర్ఘటమయ్యెను. మహారాజింకను రాలేదేమి ? అని ప్రజలెల్లరు మాటి మాటికి రాజవీథివైపునకుఁ జూచుచుండిరి. ఉన్నట్లుండి రాజాగమనసూచకముగా గంట మ్రోగినది. నాలుగుగుఱ్ఱములు బూన్చిన శకట మొకటి మంటప ముఖమున నాగినది. దానిలోనుండి కృష్ణరాయప్రభువును, దిమ్మరుసును జారుదత్తుఁడును దిగిరి. చారుదత్తుని చేతిలో నొక పేటిక యున్నది. ప్రభుఁడు మంటపమునఁ గాలిడగనే వందిమాగధులు బరాబరులు సల్పిరి. చారుదత్తుఁడు ముందు నడువ నా నరపాలశేఖరుఁడు మంత్రిసత్తమునితో వేదికఁ జేరెను. అమాత్యుఁడు తన యాసన మలంకరించెను. ప్రభువు వేదికయెక్కగనే చారుదత్తుఁడు రవ్వలుచెక్కిన గండపెండారమును, జోడు పట్టుశాలువలును దాంబూలమును గల యొక బంగారుపళ్ళెరముఁ బెట్టెలోనుండి తీసి ముందున్న ఎత్తుబల్ల మీఁదఁ బెట్టెను. తాను రాజుపార్శ్వమునఁ గ్రింద నిలువఁబడెను. సభయంతయు వింజమూఁకిడినట్లైనది. చీమ చిటుక్కుమనుటలేదు. పిదపఁ గృష్ణరాయలిట్లనెను.

'మహాకవులారా ! నా యీ కవితాపరీక్ష కష్టసాధ్యమైనదే కావచ్చును. అయిన నోరపిడిచేగాని వన్నె బయటికి రాదు. పరీక్షావివరము లివి. ఆశువున సంస్కృతాంధ్రములయందు సమముగాఁ గవిత్వము చెప్పవలయును. తెలుఁగుఁ

జెప్పునప్పుడు సంస్కృతశబ్ద మొక్కటేనియుఁ బడఁగూడదు. సంస్కృతము చెప్పునప్పుడు తెలుఁగుపదము రారాదు. సంస్కృత మంటిమిగదా యని శ్లోకములు చెప్ప వీలులేదు. దీని కయిదు నిమేషముల కాలము వ్యవధి యిచ్చుచున్నాము. ఈ యయిదు నిముసములలోపలనే ప్రారంభింపవలయును. ఆ పిమ్మటఁ జెప్పినను నంగీకరింపము. విషయము మీ యిచ్చ వచ్చినది తీసికొనవచ్చును.

కవులెల్లరు తెల్లఁబోయిరి. వారి యూహలన్నియు గాలికిఁ బోయినవి. తెలుఁగున సంస్కృతము కలుపక, సంస్కృతమునఁ దెలుఁగురానీక నెమ్మదిగా నెవ్వరైనను జెప్పుదురు. ఆశువుకూడఁ బలుకనగు గీర్వాణాంధ్రముల మిళితముఁ జేసి; పై నియమముతో నాశువుఁ జెప్ప నెవరితరము ? ఒకరి మొగ మొకరు చూచుకొనిరి. పెదవులు విఱిచిరి.

"ఆ పెద్దపచ్చడము కప్పుకొన్న పండితుఁడు చెప్ప వచ్చును. ఈ లావుపాటి కవీశ్వరుఁ డేదో కదలుచున్నాడే" యని యేవేవో చెప్పుకొనుచు వీనులు నిక్కించి ప్రజలు ఱెప్పవ్రాల్పక కవులవంకఁ జూచుచుండిరి. మూఁడు నిముసములు గడచినవి. మరలఁ బ్రభు విట్లనెను. "ఎవరును గదలిన జాడలేదే. వేలసంఖ్యగల యీ కవులలో గండపెండార మిచ్చెదనన్నఁ గైకొనఁగల మహాకవి లేఁడా? ఆస్థానకవులు కూడ నంతమాత్రమేనా?" అప్పటికి నెవరు గదలలేదు. నాలుగు నిమేషములు గడచిపోయినవి. "మఱే యిది యసాధ్యము" అనుచుండిరి కవులు. "ఆంధ్రకవితాపితామహునకుఁ

గూడ నసాధ్యమాయిది? యని మహారాజా కవిశేఖరునివంకఁ జూచెను. వెంటనే పెద్దనామాత్యుఁడు లేచి నిలువఁబడెను.

ఒక్కసారిగా సమస్త రాజలోకము, పండితులు, మహాజనము నా కవిసత్తముని( జూచిరి. ప్రాయ మప్పటికిఁ బళ్ళిమమునకు వ్రాలినది. కలమెలగాఁ దల, గడ్డము నరసినది. నాతి స్థూలమైన పొడగరి మేను. గంభీరమైన మొగమున విద్యా తేజస్సు తొణికిసలాడుచున్నది. ఒక సన్నని యుత్తరీయము మీఁదఁ గప్పుకొనియుండెను. ఇది యా కవీంద్రుని వాలకము.

పెద్దనగారిట్లు లేచి మహాప్రభూ! ఇతరు లెవరైన లేచెదరేమో యని యింతదనుక నూరకొంటిని. పెద్దనవంటి పండితులు జగమున లేరని మీ రెఱుంగరా! అవధరింపుఁడని ప్రారంభించెను. "పూఁత మెఱుంగులున్ బసరు పూప బెడంగులు చూపునట్టివా కైఁతలు" అని మొదలిడి యుత్పలమాలికలోఁ బది పండ్రెండు పాదము లత్యంతాశువున నచ్చతెనుఁగులోఁ జెప్పెను. మరల నన్ని పాదములు సంస్కృతమున నేక సమాసముగా గంగాప్రవాహమువోలె నడపెను. సభయంతయు జయజయధ్వనులు చేసినది. మహారాజు కన్నులు చెమ్మగిల్లినవి.

వేదిక దిగివచ్చి కృష్ణరాయ లా కవిసత్తముని డాకాల గండపెండారముఁ దొడిగెను. పట్టుశాలువలు పైనిఁ గప్పెను. తాంబూలమందిచ్చెను. సభయంతయు మరల నొకసారి కరతాళధ్వనులు సేసినది. ఆంధ్రకవితాపితామహుఁడను బిరుద

మల్లసానివారికే తగునని జనవిభుఁ డా విప్రవరునకుఁ గేలు మోడ్చెను.

రాజాజ్ఞచేఁ బట్టపు టేనుంగు వసుపాలమలంకరించికొని తేఁబడినది. దానిమీఁదఁ బెద్దనామాత్యునిఁ గూర్చుండఁబెట్టి కృష్ణరాయ లొక భద్రగజము నారోహించెను. విశాలములైన విజయనగర వీథులలో జనము పట్టకపోయెను. కాళులు విఱుగఁ ద్రొక్కుకొనిరి. మేడలమీఁద నెక్కి యువతులు లాజలు, పుష్పములు నా కవిశ్రేష్ఠుని మీఁదను మహాప్రభువు మీఁదను జిలికిరి.

కృష్ణరాయలు సాయంకాలము సకల విద్వద్బృంద సమక్షమున నా మహాకవి నొక యాసనమునఁ గూర్చుండఁ బెట్టి పసిఁడిపూవులతో నభిషేక మొనరించెను.

మహా వైభవముగా సాగిన యుత్సవములు పూర్ణిమతో ముగిసినవి. అంతమునఁ బ్రభువు విద్వాంసుల కెల్లరకు నంబరములు, భూములు, రత్నాభరణములు, ధనము విరివిగా నొసఁగెను. మహాజన సంతర్పణముఁ గావించెను.

సారస్వత రంగమున నా సార్వభౌముని స్థానము మొదటిది. అట్టి విద్వత్ప్రభుని మరల నాంధ్రావనియందుఁ జూడఁగల్గుదుమా !

# పాపకర్ముఁడు

## ౧

కౌరవేశ్వరుఁడు తన చుట్టును జూచెను. పట్టిబయలే. మిగిలిన సేనాసమూహమంతయు మడిసినది. పాండవపక్షమున మాత్రము సుమా రొక యేఁబదివేల సైన్యము మిగిలియున్నది. మెల్లఁగా నశ్వమును దిగెను. గదాసహితుఁడై యీశాన్యదిశ పట్టివెడలెను.

పీనుంగులతో విఱిగిన రథములతో శోణితనదులతో వివిధావయవములతోఁ బొలికలను మహాకరాళముగానున్నది. నాఁటికిఁ బదునెనిమిది దినముల క్రింద రథ గజ తురగ పదాతులతో ఘూర్ణిల్లుచున్న యా కురుక్షేత్రము స్మశానప్రాయమై పాడువడిపోయినది. సుయోధనుని కన్నులవెంట కవోష్ణ బాష్పధారలు స్రవించెను.

రాజరాజట్లు క్రోశమాత్రదూరంబరిగి ద్వైపాయనం బను మడుఁగు జేరెను. క్షుద్రవిద్యాప్రభావంబున జలములు తన్నంటకుండ స్తంభింపఁజేసి యందు డాఁగెను.

పాండుపుత్రులు దుర్యోధనునికొఱ కా ప్రాంతంబులెల్ల వెదకిరి. ఎచటను గానరాలేదు. శత్రుశేషంబు దీఱనిది వారి మానసముల కూరట యెట్లు సంభవించును. సముద్రనిస్తరణ మొకబారెఁడు మేరలో నాగిపోయినది. చింతాకులితులై కృష్ణసహితంబుగాఁ దమశిబిరంబులు చొచ్చిరి. జాడలుదీయుచుండిరి.

ప్రతిదినంబును గొందఱు బోయ లరణ్యంబున కేగి వేఁటాడి మృగమాంసంబు భీమునికై దెత్తురు. నాఁటి యుద యంబుననే పాండవులు కాననాంతరంబున దుర్యోధనుని పొడ కువ యేమైనఁ గన్పించునేమో యరయుఁడని వారి కాజ్ఞ పించిరి. కిరాతులును దత్కార్యంబున శ్రద్ధవహించియే యుండిరి.

మధ్యాహ్నమయ్యెను. బోయ లప్పటికి వేఁటసాలించి మాంసపు మోపు లెత్తుకొని తిరుగు మొగము పట్టిరి. సూర్యా తపంబున బడలి డప్పిగొని ద్వైపాయనంబున నీరుఁ ద్రావఁ జనిరి. దూరంబుననుండి వారి కీమాటలు వినవచ్చుచుండెను.

"ప్రభూ! అఖండ భూమండలంబు నేకాతపత్రంబుగా నేలి భీష్మద్రోణాదులచేఁ బనులుగొన్న నీవొక నీచునిపగిది నీ కాసారంబున డాఁగుకొనవలసెనా! ఆహా! యేమి విధివిలాసము. సేవకులమైన మాతోడ నిప్పుడే కదనంబునకుఁ గదలుము. కౌంతేయుల పీఁచం బడగింతము."

"హితులరైన మీ మాటలు కాదననుగాని, శరా ఘాతంబులచే నంగంబు లన్నియు నొచ్చియున్నవి. నేఁటికి విశ్రాంతిఁ గొనుఁడు. లావువచ్చిన నెల్లియరాతులవని పట్టింప వచ్చును. దుష్టులైన పాండుసూనుల బారినుండి తప్పుకొని మీరైన బ్రతికియున్నందుల కెంతయు సంతసించుచున్నాఁడను.

ఇట్లేవియో కృప కృతవర్మాశ్వత్థామలతో మంతనము లాడుచున్న రారాజును బోయలు కనులారఁ జూచిరి.

ఆనందాతిరేకమున మోపులుకూడ నచటనే వదలి కౌంతేయ శిబిరంబులవైపున కొక్క గంతిడిరి.

పవన తనయుఁడు లుబ్ధుల వెంటనిడుకొని యగ్రజుని కడ కరిగెను. జరిగిన వృత్తాంత మంతయు విన్నవించెను. ధర్మతనూభవుఁడు తగిన పసదనము లిచ్చి కిరాతుల సంతోష పెట్టెను.

పాండవ వాహిని మహోత్సాహంబుతో ద్వైపాయన హ్రదంబు వైపునకుఁ గదలినది. కృష్ణసారథికంబై శ్వేతాశ్వయుక్తంబయిన జిష్ణుని రథంబు సాగినది. తమ తమ వాహనంబులపై నవనీపతులు వెంటనడచిరి.

అచట దుర్యోధనాదులు, దూరంబున నుండగనే పాండవుల రాక పసిపట్టిరి. "అదె కౌంతేయులు వచ్చుచున్నారు. అప్పాపాత్ముల నిప్పు డెదిరించుట కర్తవ్య విరుద్ధము. ఎందేనిఁ దలదాఁచుకొని రేపకడ నాకు గనిపింపుఁడు. నే నీ మడువుఁ జొచ్చెద. జలమధ్య గతుండనైన నన్నీ కుంతీ సుతులు సమీపింపఁ జాలరు. తామసింపక వేగమ జనుఁడు" అని కృపాశ్వత్థామ కృతవర్మలఁ బనిచి కురురాజగాథంబైన యా మడువు నీటఁ బ్రవేశించెను.

౨

సుయోధనా! ఉత్తమ క్షత్రియుండవై పోడిమి పగఱకు వెఱచి పిఱికిపందవై యిట్లు దాఁగుట యర్హమా. శత్రువుల

నిర్జించి రాజ్యంబు గొనుము. లేదా యాహవంబున వీరశయ్య నంబునొంది స్వర్గ మధిష్ఠింపుము. దుర్మతీ! సకల బాంధవుల నన్నదమ్ముల గురుల నీకతంబుగాఁ జంపి యొంటివై యెయ్యి బ్రతుక నిచ్చు వెట్లు గలిగె. నీట మునింగినంతమాత్రమునఁ బాండుతనూజులు నిన్ను విడిచిపెట్టుదురనుకొంటివా. ఏ బలంబుఁ జూచికొని మున్ను దోగసమయంబున భగవంతుఁడైన వెన్నుని మాటలు వినక తిరస్కరించితివో దాని నిటఁ జూపుము. శత్రువులకు వెన్నిచ్చి వీరమాతయైన గాంధారీదేవి హృదయంబు పుండొనర్పకుము. జతుగృహదాహంబు సేయించితివి. విషంబులు వెట్టించితివి. నీటఁ ద్రోయించితివి. నీచేసిన ఘాతుకకృత్యంబు లెన్నేనియుం గలవు. మూర్ఖుఁడా! వాని ఫలకాలంబు సమీపించినది. భయపడనేల! మగఁటిమిగల వాఁడవైన మడుఁగు వెడలిరమ్ము. తమ్ముఁడా! దాఁగినంత మాత్రమున నిన్ను జముఁడు విడువఁడు.

అని ధర్మతనూజుఁడు వీరోక్తు లాడుచుండెను. ఆ రాజుతోడనె మహీపతులందఱు నోటికి వచ్చినట్లెల్లఁ బరిహసించుచుండిరి. మానవంతుఁడైన దుర్యోధనుఁ డా మాటలు సహింపలేకపోయెను. ధర్మరాజా! మీరు సపరివార పరికరులరు నేనసహాయుండ. యుద్ధశ్రాంతుఁడను. అలసటఁ దీర్చికొని మిమ్మెల్లర మడియించెద" నని ప్రత్యుత్తర మొసఁగెను.

ఇంతదనుక నలసటఁ దీర్చికొంటివి. మా బడలికలును బాసినవి. మే మందఱ మొక్కసారిగా నీ మీఁదికి రాము. అంత యధర్మువునకు దొరఁకొంనుమా, ఇవె యమర్చియుంచితి

నీ వలసిన సాధనంబులు గైకొనుము. ఇచ్చవచ్చిన వాహనం బెక్కుము. మఱియొక్కటి నీమనస్సున కెక్కఁ బలికెద వినుము. మా యేవురలో నీ యిచ్చకొలందిగా నొక్కని గోరి కొనుము. వాఁడె నీతోఁ బెనంగు. వాఁడు గెలిచిన రాజ్యంబు మాయదియె గదా. నీవే జయించితివేని పుడమి నీదే. అని యజాతశత్రుఁడు వలుక "రాజా వివిధములైన యుద్ధములు సేసితిమి. క్రొత్తలింపులు గూర్చును. కావున నేఁడు గదా యుద్ధము సేయుద"మని కురు ధరావరుఁ డనెను. అటులైన గదాదండంబున నొక్క త్రుటిలో నీ యసువులు నేనవాపనే" యని ధర్మజుఁడు వచించెను.

గద భుజమున నమర్చుకొని ప్రేటుదిన్న చెడిపె గుబ్బంబు కరణి నా గాంధారీ నందనుఁడు కోపంబున రోఁజుచు మడువు వెడలి వచ్చెను.

అంతట ధర్మరాజు "నేఁడు పగ వాటిల్లినంతనే యన్న దమ్ములము కాక చెడితిమా'' యని తగు సాధనము లన్నియు నొసఁగెను. తమ యైదుగురిలో నొకరిని గోరుకొను మని యెను. "మీలో నెవరైననుసరే రండు నా గదాయుధంబున కెరచేసెదనని సుయోధనుఁడు బిరుసులాడెను.

భీమ దుర్యోధనులు గదాయుద్ధంబునకుఁ దలకొనిరి. మిగిలిన రాజలోకం బంతయుఁ గూర్చుండి వినోదము చూచు చుండిరి. కృష్ణార్జును లొక క్రేవ నాసీనులైరి.

ఇంతలో నచటికి బలరాముఁ డరుదెంచెను. భీమునకును దుర్యోధనునకును గదాయుద్ధంబునేర్పిన గురుఁడతఁడు. దుర్యో

ధనాభిమాని. కురుపాండవ యుద్ధంబునఁ గౌరవులవంకఁ జేర వలయునని యతని తలంపు. కాని యఘటనఘటనా సమర్థుం డైన తమ్ముఁడు పాండవులయందుండె. అనుజున కెదిరి నిలువ మొగము చెల్లక కౌంతేయులయందుఁ జేర మనం బొప్పక యుద్ధారంభముననే తీర్థయాత్రకని నాఁడు వెడలిపోయెను. శిష్యుల పవరంబు తెఱఁగరయ నిప్పు డచ్చటికి వచ్చెను.

ధర్మరాజాదు లా బలదేవునకు నెదురేగి ప్రణమిల్లి తోడి తెచ్చిరి. అతఁడును దమ్మునిఁ బార్థాదుల నుచితరీతుల సంభావించెను. శిష్యుల నిద్దఱిని బ్రేమించి పవరంబున కనుమతి యొసఁగెను.

యుద్ధంబు సాగిపోవుచుండెను. గదాఘట్టనంబుల మింట మిడుంగురులు చెదరుచుండెను. ఒకరి నొకరు హుంకరించి కొట్టుచుండిరి. లాఘవంబున పరస్పర ప్రహారంబులు తప్పుకొనుచుండిరి. వారి చిత్ర విచిత్ర గమనంబులు చూచువారి కచ్చెరువు గలిగించుచుండెను. ఒక్కొక్కతఱి దుర్యోధనుని దే పయిచేయిగా నుండెను.

పాండవ పక్షంబులవారి హృదయంబుల విచారము హెచ్చెను. భీము నొక్కని గెలిచిన మహీమండలంబు దుర్యోధనునిదే. అయ్యో! ధర్మ రాజంత పిచ్చివాఁడా! ఈనఁగాచి నక్కలకుఁ బెట్టినట్లు చేయవలసిన దంతయుఁ జేసి పడవలసిన శ్రమలు పడి తుదకుఁ బందెపుఁ గయ్యమున కుపక్రమించెను. ఇది యెందేనిఁ గలదా యని గుసగుసలు వోవుచుండిరి.

స్వామీ! యుద్ధ పర్యవసాన మెట్లు తేలనున్నది? అని యర్జునుఁడు శ్రీకృష్ణస్వామి నడిగెను.

శ్రీకృ: అర్జునా! జయంబు సుయోధనునిదే. భీమునకు శరీర బలంబెక్కుడు. దుర్యోధనున కభ్యాసపటిమ మెక్కువ. భీముని జయింపవలెనని మీ యరణ్యవాస సమయంబునఁ బదుమూడు సంవత్సరములు రేలరేల గదాభ్యసనం బొనర్చి నాఁడతఁడు. మేని లావెంత యున్నను లాఘం బునకుఁ జాలదు. దాన దుర్యోధనునిదే పయిచేయి.

అర్జునుఁడు: అయిన నిఁక నెట్లు?

కృ: చిన్ని యుపాయ మొకటున్నది. గాంధారీసుతుని శరీరం బున నెచటను గద నాటదు. తొడలు విఱుగఁగొట్టవల యును. అప్పుడుగాని వీఁడు పడఁడు.

అర్జు: గదాయుద్ధంబున నాభికి దిగువఁ గొట్టఁగూడదు గాబో లునే స్వామీ!

కృ: అవును. ఆ వేదాంతము లిచటఁ బనికిరావు. అధర్మ పరుల నధర్మంబుననే జయింపవలయును. ధర్మం బటఁ గొఱగాదు. మీర లభిమన్యుని ధర్మ్యంబుగా వధించిరా? మఱియు ద్యూతసమయంబున నితని తొడలు విఱుగఁ గొట్టెదనని కిమ్మీరవైరి ప్రతిన చేసియున్నాఁడు. క్షత్రియు నకుఁ బ్రతిజ్ఞాపాలనంబు ముఖ్య ధర్మంబు.

## 3

కురురాజు మేన గదాఘాతంబులు తగులకుండుటకు హేతువు గలదు. యుద్ధంబునకు ముందొక దినంబున గాంధారి కుమారుని రావించి "పుత్రా! రాత్రికి దిగంబరుండవై యొంటి మెయి నాకడకు రమ్ము. రక్షాబంధంబుఁ గావించెదనని పలికెను. తనయుఁడు వల్లె యనెను.

నడిరేయివేళ దుర్యోధనుఁడు వస్త్రహీనుఁడై దిసమొలతోఁ దల్లి యానచొప్పునఁ బెడత్రోవ నామెకడకు వెళ్లుచుండెను. మార్గమధ్యంబున వాసుదేవుఁ డెదురుపడెను. భగవానునిఁజూచి యాతఁ డొక సందులో దూరెను. శ్రీకృష్ణుఁడును వెంటనేగి యెవరువారని ప్రశ్నించెను. దుర్యోధనుఁడు మెల్లగా నేనే బావా! యనెను.

కృ: ఓరి! నీత్రాడుదెగను. నిన్నుజూచి జడిసికొంటినే. ఈ యర్ధరాత్రమున నిట్లు దెసమొలతో నెటకేగుచున్నావు?

దు: మాయమ్మ యేలకో యిట్లు రమ్మన్నది.

కృ: ఆముదుసలిది మతియుండియో లేకయో రమ్మన్నఁ బోవుచుంటివా! నీవేమి చిన్నవా చితకవా! యొక లాగైనఁ దొడిగికొనిపొమ్ము. మొండిమొలతోఁ దల్లికడ కేమి పోయెదవు.

అని యా భగవానుఁడు వెడలిపోయెను. దుర్యోధనుఁడు వెనుకకేగి యొక లాగుఁ దొడిగికొని తల్లికడకుఁబోయి యమ్మా! వచ్చితి ననెను. ఆ గాంధారరాజతనయ తన తపః

ఫలమంతయుఁ గుడిచేతికిఁ దెచ్చుకొని కుమారుని శిరస్సునుండి పాదములవఱ కొక్కసారి నిమెరెను. మరల పైకి నిమురు నప్పుడు లాగెదురుతగిలెను. ఇదేమిరా యని యామె యడిగెను. లాగని యతఁడు బదులుచెప్పెను. "ఛీ! నేను దిసమొలతో రమ్మనగా నిల్లేలవచ్చితివి. ఇంతకు నీకర్మ మిట్లున్నది. యుద్ధమున నీ శరీరమునం దెచటను దెబ్బలు తగులవు. తొడలయందుమాత్రము నీ కపాయమున్నది. అని యా గాంధారి కుమారునితో నుడివెను.

ఈరహస్య మెవరెఱుంగుదురు. సర్వలోకేశ్వరుండైన గోవిందుఁ డది యెఱింగియున్నవాఁడుగావున నిప్పుడు తొడలు విఱుగఁగొట్టినఁగాని సుయోధనుఁడు వడఁడని యర్జునునితోఁ జెప్పెను.

కృష్ణానుమతంబున ధనంజయుఁడు తొడలు సూపి భీమునకు సంజ్ఞయొనర్చెను. మరుత్పుత్రుఁ డది తెలిసికొని యూర్ధ్వభ్రమణంబునఁ దనమీఁదికి లంఘించు కౌరవేశ్వరుని గదతోఁ దొడలు గుఱిచేసి కొట్టెను. అంతఁ బవిధారాహతంబైన కొండపగిది నూరువులు విఱిగి సుయోధనుఁడు నేలఁగూలెను.

పడిన యతనిఁ జేరి భీమసేనుఁడు "దురాత్మా! యేకవస్త్రయైన పాంచాలి నట్లు సభకీడ్పించి తెచ్చి పరిభవించిన పాపఫలం బనుభవింపు" మని శిరముఁ దన్నెను. మఱియుఁ గోపంబుడుగక "బంధుద్రోహీ నాఁడు మమ్ము పసులని యార్చితివి. ద్రుపదిపుత్రి యొనర్చిన సుకృతంబు కల్మి నేఁడు మాకీ శోభనంబు సమకూరినది. గొడ్డువోయిరని మమ్ము గేలిచేసిన

నిన్ను, నీయనుజుల సకలపరివార సహితంబుగాఁ జంపివైచి తిమి. ఇఁక మాకు స్వర్గమైనను, నరకమైనను నంగీకారమే" అని మెడయదిమి మరలఁ దలఁ దన్నెను.

మొదటిసారి తన్నినందులకే వగచుచున్న ధర్మజుఁడు భీముఁడా! రాజరాజని పేరువహించి సర్వ బంధుమిత్రులు దెగినను బాడితప్పక వచ్చి పోరిన యీ కురురాజు శిరం బిట్లు తన్నఁదగునే యని కోపించెను.

ఇదియంతయుఁ జూచుచున్న బలదేవుఁడులేచి "భూపతు లారా! చూచితిరిగదా యీ యధర్మము. గదాయుద్ధంబున నాభికి దిగువఁగొట్టఁగూడదు. ధర్మంబు తప్పి యీ భీముఁడు దుర్యోధనునిఁ బడవైచె'' నని యలుకగదురగఁ కనులెఱ్ఱజేసి గదాదండంబుగొని భీమునిమీఁదికిఁ బోయెను. శ్రీకృష్ణస్వామి యడ్డువచ్చి యన్నా! కోప ముపసంహరింపుము. భీముని యందు దోసంబులేదు. చంపఁ బైఁబడుచున్న శత్రువు నేదే నొక యుపాయంబున జయింపవలదా. సభలోఁ దొడలు విఱుగఁగొట్టెదనన్న ప్రతిన పవమానసుతుఁడు నెరవేర్చెను. రాజులకుఁ బ్రతిజ్ఞానిర్వహణంబు ముఖ్య"మని వారించెను.

అంత నేమియుఁ జేయలేక హలాయుధుఁడు, "ఇట్టి యధర్మయుద్ధంబుకడ నన్నేల గూర్చుండఁ బెట్టవలయు. పాడి దొలఁగక పోరిన సుయోధనున కుత్తమలోకంబులు గలుగుఁ గాక"యని కసరుకొనుచు రథంబెక్కి నిజపురంబునకు వెడలి పోయెను.

పిదప శ్రీకృష్ణుఁడు రాజులెల్ల విన దుర్యోధనుని

దుర్గుణంబు లుగ్గడించి యాదురాత్మ్మున కీచావు తగునని పలి కెను. ఆ పలుకుల కతఁ డతి రోషపరవశుఁడై నడుము విఱి గిన మహానాగంబు చందమునఁ జేతులు నేలమోపి తలయెత్తి మున్నర్జునుఁడు గృష్ణునితో సంభాషించి తొడలుసూపి సన్న యొనర్చుట యెడ నెడఁ జూచినవాఁడుగావున, నిదియంతయు శ్రీకృష్ణుని మాయాతంత్రంబని యెఱిఁగి "నీతిహీనుఁడా ! శిఖండి నడ్డువెట్టి భీష్మ్ము నట్లు చంపించితివి. ద్రోణుల వధించు టకై ధర్మ్మజుచేత బొంకించితివి. అధర్మ్మంబున భూరిశ్రవసుని చేయి నఱికించితివి. రథము పుడమిఁ గ్రుంగిన సమయంబునఁ గర్ణునిఁజంప నరునిఁ బ్రేరించితివి. నన్నిట్లు వంచించితివి. ధర్మ్మ యుద్ధంబున మమ్ము జయింపలేక మాయలువన్ని గెలిచి యిప్పుడిట్లు పలికెదవే"యని వెన్నుని దూఱెను. అంత గోపాల దేవుఁడు "దుష్టబుద్ధీ! నీ క్రౌర్యంబువలన నీవు నశించితివి. పెరల నాడనేల? సాధ్వియైన ద్రౌపది నట్లు మానభంగంబుసేయ నుద్యమించితివి. మాయాద్యూతంబునఁ గౌంతేయుల రాజ్య లక్ష్మి హరించితివి. గొంతియు నామె కొడుకులు నిద్రించు చుండ నిలు గాలిపించితివి. భీమునకు విషంబు వెట్టించితివి. నీటఁ ద్రోయించితివి. రాజుల నెసకొల్పి యన్యాయంబుగాఁ బాండవ, యాదవవంశ వర్ధనుండైన యభిమన్యునిఁ జంపిం చితివి. ఎన్నియని నీయధర్మ్మంబులు వాక్రుచ్చెద. మైత్రేయుని శాపఫలం బనుభవించితివి. నీ దోషంబులు నీ వెఱుంగక యిత రుల దూషింపనేల యూరకుండు" మనియెను.

"సకల మేదినీవరులు సేవింప నింతదనుక నప్రతిహతం

బుగా రాజ్యం బేలితి. శౌర్యంబుఁ బ్రకటించితి. భోగంబులు బడసితి. వైభవంబులు నెరపితి. ఇప్పుడు స్వర్గసుఖంబు లనుభవింప నేగుచుంటి నాకేమి? గజతురగహీనంబై బంధుమిత్రరహితంబైన యీవట్టి రాజ్యంబు ధర్మసుతుఁడు తలను గట్టుకొనుగాక!"యని యా రారాజు వలికెను.

అతనిమీఁదఁ బుష్పవృష్టి గురిసెను. చల్లని సుగంధివాయువులు వీచెను. దిక్కులు నిర్మలము లయ్యెను.

సైన్యసహితంబుగాఁ బాండవులు కౌరవ శిబిరంబులకేగిరి. అచటి పరిజన మెదురువచ్చి ధర్మసుతునకుఁ గేలుమోడ్చెను. రథంబులు దిగు సమయంబున శ్రీకృష్ణుఁ డర్జునుని దొలుత దిగుమనెను. కవచోనలును, గాండీవంబు పుచ్చికొని యతఁడు దిగినపిదపఁ బగ్గంబులు ముడిచి యదూద్వహుండును డిగియె. కపిధ్వజము భూతగణంబులతోఁ దొలఁగె. ఒక్కసారిగా నగ్నిదత్తంబైన యా రథము గాంధర్వాశ్వములతోఁ గూడఁ జురచుర గాలి బూఁదియై పడెను. అంత సవ్యసాచి యంజలి ఘటించి దేవా! ఏమిది! యరదం బిట్లూరక గాలిపోయినది" అని గోవిందు నడిగెను. అర్జునా! కర్ణుఁడును గురుఁడును బ్రయోగించిన దివ్యాస్త్రంబులచే నప్పుడే కాలిపోవలసినది. దాని నప్పుడు నా బలంబున నాపితి. కయ్యంబు ముగిసినపిదప నిపుడు కాలవిడిచితి. అదియే హేతువని వసునందనుఁడు చెప్పెను.

పాండుపుత్త్రులును మిగిలిన భూపతులును నాచోద్యంబునకు వెఱఁగందిరి.

సర్వజన సమృద్ధంబైన కౌరవేశ్వరుని భాండాగారమును గాంతేయులు వశపఱచుకొనిరి. అచటి దాసదాసీజనంబులను గజతురంగములను గైకొనిరి.

పిదప "వీడు పాడువడియున్నది నేఁ డిచట నివసింపఁ జనదు. శుచిప్రదేశమునకుఁ బోవలయును" లెండని శ్రీకృష్ణస్వామి హెచ్చరించెను. ధృష్టద్యుమ్నాదులును మిగిలిన రాజులును, రాజసైన్యంబులును "మేమీరాత్రి యిచటనే యుందుము. తెల్లవాఱినవెనుక మీలోఁ గలిసికొనెద" మని పాండవ శిబిరంబుల లోనికేగిరి. దేవకీసుతుండును, సాత్యకియుఁ బాండుసుతులును దమతమ రథంబులెక్కి యోఘవతి యను నొక పుణ్యనదీతీరంబునకుఁజని యర్ధ్వాతలంబున సంతోషంబుతో నివసించిరి.

## ౪

సూర్యుండు పశ్చిమ శిఖరంబునకుఁ జేరెను. కురుక్షేత్రంబంతయు నిశ్శబ్దత యఁలముకొన్నది. సంధ్యారాగంబులో నా పాలికలనఁ గురురాజొక్కరుండ పడియుండెను. విఱిగిన తొడలతో నతఁడు మరణబాధ యనుభవించుచుండెను. విదురుని నీతివాక్యంబులు మాటిమాటికి స్మృతికి వచ్చెను. కనుల వెంట ధారధారగా బాష్పంబులు స్రవించెను. అపుడపుడు కనులు దెఱచి దెసలు చూచుచుండెను.

అట్టితఱిఁ గృపుఁడును, గృతవర్మయు, నశ్వత్థామయు

నచటికి వచ్చిరి. ప్రభువును జూచి యా ముప్పురు కౌఁగిలించు కొని ముక్తకంఠముగా నేడ్చిరి. పిదప నాతని చుట్టు నాసీను లైరి. గురునందనుఁ డిట్లులనియెఁ బ్రభూ! ప్రతిదినము నీచుట్టు బలసియుండెడు పరిచారకులు, రాజులు నేఁడు రారేల? భీష్మ ద్రోణులు కనువెలుంగుల సంచరింప సింహపీఠంబున బృందారక బృంద పరివేష్టితుండైన మహేంద్రునిభంగి సామంతరాజగణం బుతోఁ గొలువుండు నీకీ దీనదశ ప్రాప్తించెనా! రాజా నిన్ను విడిచి యీ భూమండలమున మేమెట్లు బ్రతుకఁగలము. కురు క్షేత్రంబున నీ నాఁటి కిట్లు సకల జనక్షయంబు విధి నిర్మితంబు గాఁబోలు. కడు దీనదశలోనుండి నీకడకు మేము తొల్లి వచ్చి తిమి. వచ్చినదాదిగా సర్వ సంపదలతో మమ్మాలరించితివి. నీ సత్కృతు లెట్లు మఱువవచ్చు. నీ విట్లు పరులచే భంగపడఁ బ్రతీకారంబు సేయలేక కన్నులువెట్టి యూరక చూచుచున్న నావంటి సేవకుఁ డుండి ప్రయోజనమేమి? యని విలపించెను.

అంతటఁ గురుపతి కనులవెంట నురలు నశ్రువులు హస్త ములఁ దుడుచుకొని డగ్గుత్తికతో "మనుష్యులకు సుఖదుఃఖం బులు పర్యాయంబున వచ్చుచుండును. ఇది లోకసహజము. ఎన్ని యాపదలు ముట్టినను దలఁగక విరోధులు బెండువడఁ బోరు సల్పితిమి. తమ్ము లందఱు మడిసిరి. కర్ణాది మిత్రులెల్లఁ దెగిరి. బంధువు లందఱు నడంగిరి. ఇట్టి సమయంబున నింక బ్రతుకఁ గలిగినను లాభమేమి? నా బాహుపరాక్రమంబు పాండవులకుఁ దలముక్కలైనది. ధర్మంబున జయింపలేక యధర్మంబున కొడిగట్టిరి. అగుఁగాక నింక నే సుగతికి జను

వాఁడ. మహాత్ముండైన విష్ణు నెఱింగియు మీ సాహాయ్యంబు పెంపున సమరంబున కుపక్రమించితి. మీరలును శక్తిఁ డాఁపక పోరాడిరి. విధి విరోధించె. చేయ నేమిగలదు. వగవక సుఖంబుండుఁ" డని పాండవులు వచ్చినదాదిగా నధర్మంబునఁ దన తొడలు విఱుగ నడఁచి పుడమిఁ గూల్చినది తుదిగా యుద్ధవృత్తాంతమెల్ల నారథికవర్యుల కెఱిఁగించెను.

వినినవెనుక నాచార్యసుతుఁడు "మహాప్రభూ! పాండుసుతులు నాఁడు మా తండ్రిని వంచించి వధించినను నింత యలుక వొడమదు. ఇంతకుఁ దెగిన యక్కౌంతేయుల నా బాణజ్వాలాపరంపరల దహింపక యెట్లుండనోపుదు. నన్ను బనుపుము. బంధుమిత్ర సహితంబుగాఁ బాండవులఁ గృష్ణుండు సూచుచుండ వధించివచ్చెద. ఇది ముమ్మాటికి సత్యంబని యీసును, రోసంబును మనంబుఁ గలవరపెట్టఁ బల్కెను. సుయోధనుం డెలనవ్వు గలుగు మొగంబుతో గౌతమునివంకఁ జూచి కలశంబుతో జలంబుఁ దెమ్మనెను. అతండును దమ్ముఁ జూడ నచటికి వచ్చిన మునిబాలకుల నడిగి యొక చెంబుతో నుదకముఁ గొనివచ్చెను. రారాజు తనకు బదులుగా నశ్వత్థామకు సైన్యాధిపత్యాభిషేకంబుఁ గృపాచార్యులనే చేయుమనెను. అతఁ డట్లొనరించెను. ఇట్లు సైన్యాధిపత్యాభిషిక్తుఁడై యగ్గురునందనుఁడు రాజా! యోపికఁబట్టి నేఁదిరిగి వచ్చు నందాకఁ బ్రాణంబులు నిలుపుమని యతని నిరుసేతులఁ గౌఁగిలించుకొని కృప, కృతవర్మలు వెంట రా మహాసంరంభమునఁ బాండవ శిబిరంబుల పైపునకుఁ బోయెను.

ఆ విడిదల మహా కోలాహలంబుగా నుండెను. విజయోల్లాసంబున నా సైన్యములు పట్టరాని తమకంబున నుండె. కొందఱు సింహనాదంబులు చేయుచుండిరి. కొందఱు నర్తనంబులు చేయఁ జొచ్చిరి. మఱికొందఱు చూచి యానంద పడుచుండిరి. కొందఱు వాద్యంబులు మొరయింప సాగిరి. పెద్ద పెద్ద వెలుఁగులు వేయుచుండిరి.

ఆ ధ్వని విని యశ్వత్థామాదులు వెఱఁగంది పాండుసుతుల బాహువిక్రమంబుఁ దలంచికొని భయపడుచు నిది సమయంబు గాదని వెనుదిరిగి యడవిసొచ్చి యొక మడువుఁ జేరిరి. అచట సూతులు రథాశ్వంబులకు నీరువెట్టఁ దామును సలిలంబుఁ ద్రావి యొక వట మహీజంబు క్రిందఁ గూర్చుండి పాండవ శిబిరంబులయందుఁ బుట్టు మ్రోఁత నాలకించుచుండిరి.

దిక్కులఁ జీఁకటులు బలిసెను. భూత బేతాళ గణంబులు సంచరింపసాగె. దివాచరంబుల గమనంబు లుడిగె. రాత్రిచరంబులు తిరుగఁ జొచ్చె.

ఆ రథిక శ్రేష్ఠులు కొంతవడి యుద్ధ విషయంబులు తడవి, పరుండిరి. కృపాచార్యులును, గృతవర్మయు నిద్రవోయిరి. గురు సుతునకు నిద్ర రాదయ్యె. దేహంబున నారాటంబు హెచ్చె. మనంబు కలంగిపోయె. నే నెట్లు పాండుసూనుల జయింపఁ గలుగుదు? దైవమానుషంబులు గలిగిన వారితోఁ బోరి భీష్మద్రోణు లణ్గిరి నే నెంతవాఁడ. కౌరవేశ్వరునకుఁ బ్రీతిగా నీ కార్యంబు నేయుపాయంబున నెరవేర్ప వలయునని

యాలోచింప సాగెను. దైవంబు సూపినట్లుగా నతని కొక యుపాయంబు తట్టినది.

ఆ వట మహీరుహంబు యొక్క విశాలములైన శాఖల యందు వేలకొలందిగాఁ గాకంబులు సకుటుంబముగా నిద్రించు చున్నవి. నిద్రాసమయంబున నెటనుండియో పెనుభూతంబువలె నొక ఘూకంబు వచ్చి కొన్నింటి మెడలు నలిపి కొన్నింటిని కొఱికి కొన్నింటిని గ్రుడ్లు వొడిచి వివిధవిధంబుల నా కాకంబుల నెల్ల మడియించెను.

అదిచూచి యశ్వత్థామ సంతసించెను. నాకు దైవము త్రోవ సూపుచున్నాఁడు. నిద్రాగతంబులైన పాండవ సైన్యం బుల నీ గూబపోల్కి వధియించెదఁగాక యని కృతనిశ్చయుఁడై మామను, కృతవర్మను లేపి తన యుద్యోగంబు వారల కెఱిఁ గించెను.

కృపాచార్యుం డతని కిట్లనియె. నిద్రమునింగినవారు చచ్చినవారితో సమానంబు. కావున నట్టి సమయంబున వారి మీఁది కేగుట యధర్మంబు. ము న్నెన్నడును గలుషం బెఱుం గని నీ విట్టి పాపకార్యంబున కొడిగట్టకుము. మన మిపుడు రాజైన ధృతరాష్ట్రుని కడకు బోదము. అచట విదురుండును గాంధారియు నుందురు. వారు ముప్వురు చెప్పినట్లు ప్రవర్తిం చిన దోషంబు లేదు. సూర్యోదయ సమయంబున మన పరా క్రమంబుఁ జూపవచ్చును. నిద్ర వచ్చుచున్నది. పరుండుము.

ఆ మాటలు విని యశ్వత్థామ మాతులా! కోపంబునం గలంగినవానికి, నర్థచింతకునకు, రోగపీడితునకుఁ గామం బగ్గలఁ

బైన వానికి నిద్ర వచ్చునా! ధనుర్గురుని నధర్మంబుగా వధియించి తలవట్టి యీడ్చిన దుష్టాత్మునిఁ జంపక యెట్లు చూతు. నేఁడు సంగరజయంబున వారెల్లరాదమఱచి శంక లేక నిద్రించుచుందురు. ఏ యుపాయంబుననేనిఁ బగఱఁ దును మాడుట నీతిశాస్త్రసమ్మతంబు కదా. మీ రెంతచెప్పినను నే నీ రాత్రి పాండుపుత్రుల వధియింపక క్షత్త్రశంబు వుచ్చను. వచ్చిన మీరును రండు. లేకున్న నిచటనే యుండుఁడని యా పాపకర్ముఁడు రోషావేశంబున పాపంబున కుద్యోగించి రథం బెక్కి శిబిరంబులవైపునకు సాగె.

అసురావేశంబునఁ జేసి వారును వెనుకనేగిరి. ద్రోణ సుతుఁ డట్లువోయి మాటుమణఁగి నిశ్శబ్దంబై యున్న పాండవుల విడిదలఁ జొచ్చెను.

శిబిరములలోఁ బ్రవేశింపఁగనే కరాళముఖంబైన యొక మహాభూతం బతని కెదురుపడియె. చలింప కాతఁడాఁ భూతంబు మీఁద నస్త్రప్రయోగంబున కుపక్రమించె. శరంబులన్నియు దానిని సోఁకక యంతర్హితంబులగుచుండె. తోమరంబువిసరె; గదయడరించె. ఎన్ని సాధనంబులు ప్రయోగించినను నన్నియు వ్యర్థమ్ములయ్యె. అంత తన మనంబున నయ్యో! ధర్మంబు విడిచి యధర్మంబవలంబించిన వానికెట్లు కార్యంబు సిద్ధించు. గోవును, బ్రాహ్మణుని, బాలుని, వృద్ధుని, గ్రుడ్డివానిని, హితునిఁ దోఁబుట్టువును, జడుని, నున్మత్తుని, గురుని, సుప్తుని, వనితను భీతుని నస్త్రశస్త్రదులచే నొప్పింపఁదగదని పెద్దలు సెప్పు దురు. నేను దాని లెక్కసేయక యిట్లు పాపంబున కుద్య

మించితి నిప్పుడీ భూతంబు నెట్లు జయింతు? తెరువేది యని, విషణ్ణుండై యాపద్బాంధవుండైన పరమశివుని భజించి యిప్పుడీ కీఁడు వాపుకొందుగాత మని యొకచో నాసీనుండై నిర్మల భావంబున భూతమయుండైన ప్రమథనాథుని నిలిపి భజింపఁ జొచ్చె.

అంత నాతని యెదుట నొక వేదియు దానిమీఁద నగ్నిహోత్రంబును నుద్భవించె. ఆచార్య సుతుం డందుల కెంతయు సంతసించి తన శరీరం బా మహేశ్వరున కుపహారం బొనర్ప నిశ్చయించి వేదిక సమీపించి యగ్నిలో దూఁకఁ బోయెను. అగ్ని కొంచెముగానుండుటవలనఁ దన రథంబు మీఁదికిఁ బోయి శరాసనంబును నంబులపొదులును దెచ్చివేసి యగ్నినిఁ బ్రజ్వాలింపఁజేసెను. మండుచున్న యా జ్వాలలయం దుఱుక నిశ్చయించి యేకాగ్రచిత్తంబునఁ బార్వతీప్రియుని నిలిపెను.

దేవా! ఆంగిరసకులజనితంబైన యీ యంగము నీ కుపాయనము సేయుచున్నాఁడఁ గైకొనుమని పలుకుచు నా మంటలయం దుఱికెను.

అంత శివుఁడు ప్రత్యక్షమై "నీ నిర్మలభావంబునకు మెచ్చితి. భూతాకృతితో నీ ధైర్యంబుఁ బరీక్షింపవచ్చితి. జయంబగుఁ గాక యని యొక ఖడ్గంబిచ్చి యొరులకుఁ దెలియకుండ నా భూతేశ్వరుఁ డశ్వత్థామ శరీరంబునఁ బ్రవేశించెను.

గురుసుతునకుఁ దొల్లిటికంటె వేయిమడుంగులుగా బల పరాక్రమ జవోత్సాహంబులు హెచ్చెను. వచ్చి కలిసికొనిన

కృప కృతవర్మలను జూచి మీరలిచ్చట ద్వారప్రదేశంబున నిలువుఁడు. నే నసహాయుండనై శత్రువులఁ బొరివుచ్చి వచ్చెద నని వారి నట నిలిపి తాను లోనికిఁ జనెను. అవ్విడిదలతెఱంగును వారివారి సన్నివేశంబులు నిట్టిట్టివని ప్రసంగవశంబున మున్న వినియున్నవాఁడు గావున మొదట ధృష్టద్యుమ్నుని శిబిరంబునకు నేగె.

దివ్వెలవెలుంగున మేలుకట్లతో నమరియున్న పూపు సెజ్జమీఁద నాద్రుపదతనయుండు నిద్రవోవుచుండె. గురువధ కారియైన యతనిఁ జూడఁగనే కోపం బగ్గలంబుగా నశ్వత్థామ రథంబు డిగ్గి సమీపించి పాదంబున నతనిని దన్నెను. ధృష్టద్యుమ్నుండు మేలుకొని కనులుదెఱచి చూచి యప్పాపాత్ము నెఱింగి లేచి నిలిచెను. వెంటనే గురునందనుం డతని మెడఁ బట్టి పెడమరలగాఁ దివిచి క్రిందఁబడవైచెను.

ఉరంబున నెక్కి మోకాల నదిమిపెట్టెను. ధృష్టద్యుమ్నుఁ డెంత ప్రయత్నించినను బైకి లేవలేకపోయెను. గోళ్ల గీరెను. నోటితోఁ గఱచెను. ఎన్ని చేసినను బ్రయోజనములేకపోయెను. చివరకు గొంతుకఁ బెకలించుకొని "మరణాంతములు వైరములు. కత్తితో నన్ను నఱకుము. పుణ్యగతికిఁ బోయెదనని బ్రతిమాలెను." గురుద్రోహివైన నీకుఁ బుణ్యలోకం బెక్కడిది దుర్మరణంబు వొందుమని వింటి గుణంబులాగి మెడ కురివెట్టి నులిమినులిమి పశువును వధియించినట్లు చంపి దొరలించెను.

ఆ సవ్వడికిఁ జుట్టుప్రక్కల వారెల్ల మేలుకొనివచ్చి భయదరూపుఁడైన యయ్యశ్వత్థామను గని మహాభూతంబని

కేకలువైచిరి. రథంబెక్కి యడ్డువచ్చినవారినెల్ల బాణపరం పరలఁ జదుపుచు నేనుంగుమొగసాలఁజొచ్చి కొన్నింటి తొండముల నఱికి కొన్నింటి గండములు చెక్కి కొన్నింటి తలలు తెగవైచి యన్నింటిని జంపెను. గుఱ్ఱంబులనెల్ల రూపు మాపెను.

పిదప యుధామన్యుని సుత్తమౌజుని శిబిరంబులు జొచ్చి ధృష్టద్యుమ్నుని పోల్కి నాయుధంబున నఱకక పశు వధ గావించి మహాసంరంభంబున సింహనాదం బొనర్చెను. చుట్టుముట్టిన మాత్స్యప్రభద్రక పాంచాలసైన్యంబుల నుఱు మాడెను. శతానీకుని సంహరించెను. శిఖండి నొక్క కత్తి వ్రేటున నిఱుపఱియలుగాఁ జేసెను. ద్రౌపదీకుమారుల నేవురఁ దలలు డొల్లనేసి భూమికి బలియిచ్చెను. ఆ బీభత్సంబుఁ గని వెఱఁగంది పాఱిపోవువారిని వెన్నాడి తునిమెను. తప్పించు కొని పోవువారిని ద్వారంబుకడఁ గృపకృతవర్మలు సంహ రించిరి.

పాండుసూనులును, సాత్యకియు, శ్రీకృష్ణుండును వానికిఁ గానరారైరి. ఇట్లప్పాపకర్ముండు తెలతెల వేగునప్ప టికి శిబిరంబులలో నిద్రించు సమస్త సైన్యములను బ్రతి వింధ్యాది ద్రౌపదీ కుమారకులను దక్కిన రాజులను వధించి నెత్తుట జొత్తిల్లిన మేనితో మాంసపంకదిగ్ధంబైన ఖడ్గంబుతో న వ్విడిదల వెడలి కృప కృతవర్మలఁ గలిసికొని వృత్తాంతము వచించెను.

వారును రాక్షసావేశంబు వదలినందునఁ దా మొనర్చిన

ఘోరకృత్యంబునకుఁ దామే పశ్చాత్తప్తు లగుచున్న వారుగాన నతనిఁ జూడఁగనే దలలు వంచుకొని యతని నగ్గింపరైరి.

గురుసుతుం డది యెఱింగి పాండుసూనులఁ దెగటార్చిన బాగడనగుఁగాని యది యొనర్పనేరని నేను బ్రశంసకు నెట్లు పాత్రంబగుదు. మన పుణ్యావశంబున రా జింక బ్రతికియున్న వాఁడేమో వేగమ పోయి విషయం బెఱిఁగింతము రండనెను.

ఆ రథికశ్రేష్ఠులు ముప్పురును బోయి రక్త సంసిక్తమైన ధరాతలంబునఁ బడి ప్రాణంబులు విడువనున్న యా కౌరవేశ్వరునిఁ గని కౌఁగిలించుకొని మేదినీమండలంబెల్ల నేకాత పత్రంబుగా నేలిన నీకిట్టి దురవస్థ సంభవించెనే యని యేడ్చిరి. ప్రభూ! మ మ్మెఱుంగవా యని తమ రాక తెలుపుకొనిరి. సుయోధనుఁడు మెల్లనఁ గన్నులు విచ్చెను. రాత్రి వృత్తాంతమంతయు నశ్వత్థామ యతనికిఁ దెలియఁ జెప్పెను. శ్రీకృష్ణుఁడు నా రాక ముందే యెఱింగి యెచ్చోటనైన దాఁచెనేమో! పాండుసూనులును, సాత్యకియు, నా వసుదేవ సుతుఁడును నాకుఁ గానిపింపలేదనెను.

శత్రువధ వృత్తాంత శ్రవణమున నాలుకకుఁ గొంత లావు వచ్చినట్లైన నా గాంధారీకుమారుఁడు "కర్ణుఁడు మహా పరాక్రమవంతుఁ డందు రతని కంటెను శల్యుఁడు ఘనుఁ డందురు. వారును నీ వధించినంతగా శత్రువుల నుఱుమాడలేక పోయి" రని గురుపుత్రు నగ్గించెను.

ఇంక మీారు సుఖం బుండు డేను బోయివచ్చెదఁ ద్రిదివంబునఁ బునర్దర్శన మయ్యెడు మని యా వసుమతీపాలుం

డసువులు విడిచెను. వారును రోదనంబు చేసి తిరిగి తిరిగి చూచుచు వెడలిపోయిరి.

౫

ఓఘవతీ తీరంబునఁ బ్రభాతంబుననే లేచి పాండు తనూభవులు శత్రువధోత్సాహంబునఁ గృష్ణసహితులై సల్లాపసుఖం బనుభవించు చుండిరి. అట్టితఱి ధృష్టద్యుమ్నుని సారథి ధర్మరాజు కడ కేగి కేలుమోడ్చి నాఁటి రే జరిగిన వృత్తాంతమెల్ల విన్నవించెను. శిబిరములలో నొక్కఁడైన మిగులలేదు. నేనెట్లో బ్రతికి వచ్చితినని యశ్వత్థామ కృత్యంబు లుగ్గడించె. పిడుగడఁచినట్లయ్యెను. ధర్మజుఁడు మూర్ఛాగతుఁడాయెను. శైత్యోపచారంబులు సేయఁ గొంతవడి కాతఁడు లేచెను. కృష్ణుండును దక్కువారును గడు విషణ్ణులైరి. ధర్మజుఁడు నకులునితో ద్రౌపది ద్రుపదపత్నిఁ నూరడింపవోయి యటనుండి వచ్చి యుపప్లావ్యంబున నున్నది. ద్రుపద మరణంబునకు వగచుచున్న యా సాధ్వి యీ పుట్టింటి సర్వనాశనంబునకును గుమారసంహారంబున కెంత యడలునో వెంటనే నీవుపోయి విడిదలకుఁ దీసికొని రమ్మనెను. నకులుండు రథం బెక్కి యుపప్లావ్యంబున కేగెను.

పాండవులును దమ రథంబు లెక్కి విడిదలకుఁబోయి యచట నశ్వత్థామనిహతులై పడియున్న పాంచాలుర ద్రౌపదేయులఁ జూచి మిగుల విలపించిరి.

కొంతవడికి నకులుండు ద్రుపదనందనఁ గొనివచ్చెను. ఆమె మృతులైన కుమారులఁ జూచి మొదలునఱికిన కదళిక వోలె నేలకొఱగెను. కృష్ణాదులామెను బెక్కువిధంబుల నూరార్చిరి. పిమ్మట నామె లేచి యాసీనయై గురుసుతుని దారుణకర్మస్మరణంబునఁ జిత్తంబు కోపాయత్తంబుగా నిద్రాసమయంబున నా పుత్రుల నిట్లువధించిన దుష్టాత్మువధియించి తచ్చిహ్నంబుగా నతని శిరోరత్నంబుఁ గొనివచ్చి చూపినఁగాని నే బ్రతుకనోప. లేకున్నఁ బ్రాయోపవేశనంబున నుసులు విడనాడెదనని భీమసేనుఁ దత్కార్యంబునకుఁ బ్రేరించె.

అతండును మహాకోపంబున నకులుని సారథిగాఁ జేసికొని చాపబాణాసి గదాసహితంబైన యరదంబెక్కి వెడలెను. కురుక్షేత్ర సంచారిజనంబుల నశ్వత్థామ జాడలడిగి యతండు కృష్ణ ద్వైపాయనుని యాశ్రమంబుననుండుట దెలిసికొని యటుపోయెను. భీముని పోకవిని ధర్మసుతునితో దేవకీసుతుఁ డిట్లనియె. అశ్వత్థామకడ లోకసంహారకంబైన బ్రహ్మశిరంబను మహాస్త్రంబుగలదు. దానిని తపఃప్రభావంబున ద్రోణుండగస్త్యునివలనఁ గైకొనియె. నతం డర్జునున కిచ్చె. పుత్రప్రేమంబున నశ్వత్థామకు నొసంగెను. కుమారుని దుర్బుద్ధి యెఱింగి పుత్రా యిది మనుష్యులమీఁదఁ బ్రయోగింపఁజనదు. ఎంతెంతలువచ్చిన నితరోపాయంబులనె తీర్పవలయునని గురుండు వచించెను. కాని యప్పాపాత్ముం డది గణింపఁడు. తదస్త్రగర్వంబున నెప్పుడు విఱ్ఱవీఁగుచుండును.

తొల్లి యొక్కసారి వీఁడు ద్వారకకు వచ్చి యదు

కుమారులతోఁ గొన్ని దినంబులుండి యొక దివసంబున నా కడకు వచ్చి "నా దగ్గఱ బ్రహ్మశిరంబను మహాస్త్రమున్నది. దానిని గలశజునివలన మా తండ్రి గైకొనియె, నది నీకిచ్చెద. నీ చక్రాయుధంబు నాకిమ్మని యడిగెను. అతని యంతర్మదం బెఱిఁగినవాఁడ నగుట నేను నవ్వి "నీకడ బదులుపుచ్చుకొని యిచ్చుట మిత్రలక్షణంబా? నీ యస్త్రంబు నాకవసరము లేదు. నీ యిచ్చవచ్చినదానిఁ గొనుమని నా చాపఖడ్గ గదా చక్రముల నెదుటఁ బెట్టితిని. అన్నిచుండు సుదర్శన మభిలషించి తన వామహస్తంబున దానిం బట్టుకొని యెత్తఁబోయెను. అది కదలదయ్యె. రెండుచేతులు జోడించి తన బలంబెల్లఁ జూపి పట్టినను నద్దివ్యాస్త్ర మించుక చలింపలేదు. అస్త్రంబుఁ గదల్పఁ జాలమికి లజ్జించి యూరకుండె. అప్పుడే నిట్లంటి. హిమశైలంబున రుక్మిణీసహితుఁడనై బ్రహ్మచర్యవ్రతంబునఁ బండ్రెండు సంవత్సరంబు లుగ్ర తపంబుఁ జేసి దీని నార్జించితి. దేవ గంధర్వ దానవాది సమస్త భూతంబులు నాకు సమములు గాకుండునట్టి దోర్వీర్యంబున వెలసియుండుదు. నీ చక్రంబు బలభద్రాది యాదవ వీరు లెవ్వరును నడుగరు. నరుఁడు తపః ప్రభవంబున శ్వేతాశ్వ కపిధ్వజ గాండీవంబులఁ బడసె. ఎక్కటిపోరఁ బరమ శివుని మెప్పించి పాశుపతాస్త్రంబుఁ గొనియె. అతని కేను బ్రాణంబులకంటె నెక్కుడు గూర్తు. వాని కీఁదగని దెద్దియును లేదు. అట్టి ప్రియవచ్ఛుండును దీని నడుగఁడయ్యె. భరతవంశాచార్యపుత్రుండవు. సకలమాన్యుండ

వింతవట్టు దెలియక నన్నిట్లడుగుదె? దీనితోడ నెవరితో రణం బాచరింప నెంచితి వంటెని.

పిదప నతఁడు "దీనిఁ గైకొని నిన్ను బ్రతిమాలియైన నొప్పించి నీతో సమరంబు సేయ వాంఛించితిని. పోనిమ్ము. చక్రంబు లేకున్నంతమాత్రమున నేమాయెఁ దప్పక నీతో సమరంబు నొనర్పఁ గలవాఁడ" ననియె. నేను నవ్వుచు నట్ల కాకయని ద్రోణాచార్యుల పుత్రుఁ డనెడి గౌరవంబున మేలు జాతి గుఱ్ఱంబులును, రత్నాంబరంబులును నిచ్చి పంపినఁ బోయెను.

దురహంకారంబునకుఁ గారణంబైన యట్టి బ్రహ్మశిరో నామకాస్త్రంబున నతండు భీముని బాధించును గావున వేగ పోవలయునని సాత్యకి సహదేవులం బిలిచి శిబిరరక్షణంబు నకు నియమించెను.

తన దివ్యస్యందనమున శైబ్య సుగ్రీవమేఘ పుష్ప వలాహకంబులఁ బూన్చి భుజగారి కేతనంబెత్తించెను. తాను నొగలెక్కెను. గాండీవతూణధరుఁడై ధనంజయుండును నెక్కె. ధర్మసుతుఁడును నరదం బధిరోహించె.

ప్రతోదంబు పుచ్చికొని వాసుదేవుండు మహావేగం బునఁ బఱప నయ్యరదంబు పవమానసుతుని రథంబుఁ గలిసి కొనియెను. అట్లు భాగీరథీతీరంబునఁ బోవుచు వారలెంత వారించినను వినక భీమసేనుఁడు ముందుజని యాశ్రమంబున మునిబృంద పరివేష్టితుండైన వేదవ్యాసమౌనిం గని మనం బుననె నమస్కరించి దిశలుసూచె. ఒక క్రేవ మేనినిండ

బూఁదియలంది జడలుధరించి కూర్చుండియున్న యశ్వత్థామ గానిపించె. భీముఁ డతనితోఁ, దులువా! యెంతలోఁ దపసి వైతివి. నీ కావించివచ్చిన ఘోరకృత్యం బెవ్వరెఱుంగరను కొంటివా యని చాపంబందుకొని సజ్యంబుచేసె.

గురుసుతుండు మరుత్సుతుని నతని వెనుకవచ్చు ధర్మజ కృష్ణార్జునులఁ జూచి యమ్మహానుభావుల దివ్యాస్త్రవేది త్వం బెఱింగినవాఁడు గావున భయకంపితుండై ప్రాణభయంబున నొక్క యిషీకంబు వుచ్చికొని బ్రహ్మశిరోనామకంబను దివ్యాస్త్రంబుఁదలంచి దాని నయ్యిషీకంబున నావహింపఁజేసి యపాండవమయ్యెడుమని ప్రయోగించె.

అయ్యస్త్రంబు ప్రళయకాలాగ్నియుంబోలె మహా భయంకరంబై పెక్కు యోజనంబుల యెగపున మండఁ దొడఁగె. అంబుజాక్షుఁ డదిచూచి "అర్జునా! యిది బ్రహ్మ శిరంబను దివ్యాస్త్రంబు. దీని నొండస్త్రంబు నివారింపఁ జాలదు. నీవును బ్రహ్మశిరంబుఁ బ్రయోగించి నిన్నును నీ సోదరులను వేగంబుగాఁ గాచికొను" మనియెను. అర్జునుఁడును రథంబు డిగ్గి శుచియై ధనురాచార్యుం దలంచి యస్త్రదేవత లకు నమస్కరించి శరంబు చాపంబున సంధించి మొదల గురు తనూభవునకు నపాయంబు గలుగకుండవలయునని ప్రార్థించి పిదప నాకును నా సహోదరులకును శుభమగు గాక యస్త్రంబస్త్రంబున నుపశమింపవలయునని విడిచె.

అదియును నాభీలకీలాకరాళంబై మిన్నెల్ల వ్యాప యంబుగా మండి యశ్వత్థామాస్త్రంబుఁ గ్రమ్మరింప నుత్స

హించె. అయ్యస్త్రంబును మఱలక మఱింత పెరిగె. ఇట్లు లోక
భీకరంబులై మండుచున్న దివ్యాస్త్రంబుల నవలోకించి
సముద్రములు ఘూర్ణిల్లె. ఉల్కలురాలె. సూర్యబింబము
మాసె. పిడుగులువడియె. భూతజాలంబు హాహాకారం బొన
రించె.

అట్టితఱి జగదాచార్యుండైన నారదుండు సాత్యవతేయునకు బాసటయయ్యె. అప్పరమ తాపసు లిరువురును నస్త్రంబు లొండొంటితోఁ గలియకుండ నడుమ నిలిచి యిట్లనిరి. మహాస్త్రవేదులగు శూరు లనేకులు జనిరి. ఎవ్వరైన నీ మహనీయాస్త్రంబు ప్రయోగించిరే! లోకంబుల కపాయంబు గలుగకుండ వెంటనే మీ మీ యస్త్రంబు లుపసంహరింపుడు. మానవులపై నీ యస్త్రంబు ప్రయోగింపఁ జెల్లదు.

అనిన సవ్యసాచి మునీంద్రులారా! యస్త్రమస్త్రంబుతో నుపశమించుటకును బ్రాణసంరక్షణంబుఁ గోరియు దీనిఁ బ్రయోగించితి. వలయునేని నిప్పుడ యుపసంహరించెద. కాని యి ప్పాపాత్ముండు తానీ యస్త్రంబున మమ్మందఱ దహించుం గావున మాసేమంబులు మీమానసంబులఁ దలంపవలయునని యొక్క త్రుటిలో తన యస్త్రంబు నుపశమింపఁ జేసె. అట్లు వారించుటకుఁ దపఃప్రభావ సంపన్నుండైన యర్జునునకుఁదక్క నిం కెవ్వరికిని శక్యంబు గాదు. ఎవ్వరేని వారించిన నా మహనీయాస్త్రంబు వారించిన వారి తలఁ ద్రుంచు. గురుభక్తియు, వ్రతయుక్తియు నధికంబుగాఁగలిగిన కిరీటి తాపసులు మెచ్చుకొన నివారించె. అశ్వత్థామ తన యస్త్రం బుపసంహరింపఁ

ప్రయత్నం బొనరించి శక్తుండుగాక సాత్యవతేయునితో నిట్లనియె. ఈ భీముం డధర్మంబునఁ గురురాజును సంహరించె నంత బోక నా ప్రాణంబుల కిపుడు దెగియె. ప్రాణభయంబువలన వివేకహీనుండనై యిమ్మహాస్త్రంబు విడిచితి. దీని నుపసంహరింపఁజాల. బాండుపుత్రుల రూపుమాపక యిది శాంతింపదు.

అనినఁ బారాశర్యుం డిట్లనియె. దుర్మతీ! వివ్వచ్చుండు నీకుఁ గీడు దలంపక నీ యస్త్రం బుపశమించుటకై నిజాస్త్రంబుఁ బ్రయోగించె. మేము వలదన్న వెంటనే యుడిపె. ఇట్లస్త్రవిద్యా నైపుణంబున సడిసన్న యర్జును వధింప నీకు శక్యంబగునే! నీ యస్త్రం బితని యస్త్రంబుచేత నుపశాంతం బగు నంతియ. మనుష్య విషయంబుగా నిమ్మహాస్త్రంబు ప్రయోగింపరాదని యెఱుంగుదువు. ఒకనిచేఁ బ్రయుక్తం బైన యస్త్రంబు మఱియొకనిచే నుపసంహృతం బైన నద్దేశంబునకుఁ బండ్రెండేండ్లు వృష్టిలేకయుండు. లేకున్న నీయస్త్రంబును నుపసంహరింపఁ గవ్వడి వలంతియ. తపంబునకుఁ జొచ్చితివి. రోషంబు వలదు. ధర్మ పక్షపాతంబున నిన్ను జంప నొల్లక యున్న పార్థుండు బ్రీతుండై చనవలయుఁ గావున నీ శిరోరత్నం బితని కిమ్ము. దానితో నిన్ను వధించిన యట్లు పాండుతనూభవులు సంతసింతురు. ఇదియ సముచిత సంధిప్రకారంబు.

అనిన నగ్గురునందనుండు మహాదుఃఖంబున మునీంద్రా! పాండుసుతులకు రత్నంబులు కొఱఁతయా! కౌరవనాథుని భాండాగారమెల్లఁ గైకొనిరి. ఈ దివ్యరత్నం బెవ్వరికడ నుండు,

వారికి సర్పభయము, చోరభయము, భూతభయమును గలుగవు. ఆకలియు డప్పియు బాధింపవు. అట్టి దీని నెట్టు లీనేర్తునయిన నీవచన మనుల్లంఘనీయము. నీకిచ్చెదఁ గైకొను మనియె.

ఆ వెనుక నస్త్రంబు నేమిసేయుదువని సాత్యవతేయుండడుగఁ బాండవరాగ పాత్ర గర్భంబుల దహించి యీ యస్త్రంబు శాంతించుగాత మనియె. ముని యందుల కంగీకరించి వేఱొకదాని కాసపడక యట్ల సేయుమని పలికె.

అంత నప్పాపాత్ముండు తన మానసంబున "బాండవేయ రాగపాత్ర గర్భంబులని తత్సంతాన జాతగర్భంబులఁ గూడ నుగ్గడించినవాఁడనైతి. అది యెఱుంగక మునిశ్రేష్ఠుండు పాండవపత్నీగర్భంబులని యనుమతియిచ్చె. ఇది తెలిపిగా సకలగర్భవిధ్వంసనంబు గావించెదనని కృష్ణద్వైపాయనునితో నట్టులే సేయువాఁడనని పలికె.

అద్దురాత్ముని సంకల్పం బెఱిఁగి భగవంతుండైన నారాయణుండు దుర్మతీ! సకలగర్భ విధ్వంసనంబుఁ గావింపఁ జూచుచుంటివి. పాండవ సంతానార్థంబుగా నొక్కని జననందితుండైన వాని నే నీఁదలంచితి. అట్టి గర్భంబొక్కటి వదలి మిగిలిన వానిపైఁ బ్రయోగింపు మనెను.

అనిన నతం డిట్లనియెఁ, బక్షపాతంబున నీ విట్లు పలికిన నేనట్లేల సేయుదు. నీ వుత్తరాగర్భంబు రక్షింపఁ జూచెదవు. నీ వప్పనికిఁ బూనినను నా యస్త్రంబున విధ్వంసనం బవశ్యంబు చేసెద.

అశ్వత్థామ పలుకులు విని వనజాక్షుండు నీవు హాని యొదవించినను నుత్తరయందున్న యభిమన్యు తేజంబును రక్షించి యబ్బాలకునకే నాయువిచ్చి ప్రోచెద ననియె.

రక్షించిన మేలకాదె నీ తపఃప్రభావంబు లెల్లరము చూచెదమని యద్దుష్టాత్ముండు మహానుభావులైన సాత్యవతేయ దేవకీనందనుల పలుకులు నిరాకరించి పాండవసంతాన సకలగర్భవిషయంబుగా నస్త్రప్రమోచనంబు చేసె.

అది చూచి జనార్దనుండు మున్నొక్క త్రికాలవేదియైన బ్రాహ్మణుండుపప్లావ్యంబున నుత్తరంగని నీ గర్భంబునఁ బరిక్షీణప్రాణుండై యొక్క యర్భకుండు వొడము. దానఁ బరీక్షిత్తనునామంబు వహించునని చెప్పె నమ్మహాత్ముని వాక్యం బేల వృథ గానేర్చు. అబ్బాలుండు పాండవ వంశకరుండగుఁ గాకయని కోపంబున బాలఘాతివగు నీకు నశనంబు దుర్లభంబై నిస్సహాయుఁడవై దుర్గంధరక్తం బంగంబుల స్రవించుచుండ మూఁడువేలేండ్లు తిరుగుము. నా చేత రక్షింపఁబడిన యా డింభకుఁడు కృపాచార్యులవలన ధనుర్విద్య నేర్చి పెక్కు హాయనంబులు వసుధఁ బాలింపఁగలవాఁడు. వానికి జనమేజయుండను ప్రభువు జనించి నీవు చూచుచుండ మహావైభవంబునఁ బ్రవర్తించు చూడుము నా తపస్సత్యంబుల ప్రభావమని పలికెను.

బ్రాహ్మణుఁడవయ్యు నా మాటల నాదరింపక యిట్టి పాపకృత్యంబు చేసితివి. కేశవుఁడు చెప్పినయట్లు లగుమని పారాశర్యుండును శపించి, ఛీ నీచకర్ముఁడా! పొమ్మనెను.

అంత నా యాచార్యసుతుఁడు సాత్యవతేయునిఁజూచి మునీంద్రా! నీవు మనుజులలోన నుండెద'వని ప్రతిశాపంబిచ్చి దీనవదనంబుతో శిరోరత్నంబుదీసి పాండవులకిచ్చి తపోవనంబున కరిగెను.

పాండవులును దిరిగివచ్చి శిరోరత్నంబిచ్చి ద్రుపదనందన నూరడించిరి. ఆ రాజపత్నియు దానినిజూచి కోపంబు కొంత డిందువడ మణి ధరింప నర్హుండు ధర్మజుండ యని దాని నా భూపతికి నొసంగెను.

# ప్రవర్తనము

## ౧

రాజంపేఁట మంచి కాఁపుటూరు. ఏఁడెనిమిదివందలకుఁ బైచిల్లరగా నిండ్లున్నవి. కొలఁదిగా నితరజాతు లున్నను గాఁపుల బలమెక్కువ. ఊరిలో నందఱు పెద్ద సంపన్నులు కాకపోయినను గూడు గుడ్డలకు మాత్రమే యొక్కరికిఁ గొఱంత లేదు. అందఱును వ్యవసాయముచేయు రైతులు. కనీసము రెండెకరములకుఁ దక్కువయున్నవారు లేరు. అథవా యెవరైన నున్నఁ బాలికిఁదీసికొని భూమి సాగుచేయుచునే యుందురు.

అదనెఱిఁగి సేద్యముచేయుటలోఁ బేఁటవారు మంచి నేర్పరులు. వరి కోయఁగనే వేరుసెనగ మొదలైన పైరులు వేయుదురు. మెట్టభూములందు మెట్టపైరులు పల్లపుభూముల యందుఁ బల్లపుఁబైరులు విరామములేక పండించుచుందురు. ఏ వస్తువులును వారికి గొన నవసరములేదు. రాగాఁ బోగా నుప్పు చింతపండేమైనఁ గొందురేమో. ఇట్లు వివిధములైన పంటలతోఁ జక్కగా బలిసియున్న దా యూరు.

గ్రామములోని కెల్లఁ బెద్దరైతు సుందరయ్య. ఒక యేఁబది యెకరముల మాగాణి, ఆఱుగురు జీతగాండ్రు, ఐదరకల యెడ్లు, హంగు, అట్టహాసము మొత్తముమీఁద నతనిస్థితి చాల గట్టిగానున్నది. ఊరిలో నతఁడన్న నందఱికి నొకవిధమైన వెఱపు. స్థితికిఁదగినట్లు సుందరయ్య గుణసంపత్తుగలవాఁడు

కాఁడు. వట్టిదుర్బుద్ధి. కలవాఁడుగదా యని యాసపడి యెవ
రైన యాచకులు వచ్చినఁ జీవాట్లు దప్ప మఱేమియు నతని
కడ లభింపవు. ఊరిలో నందఱును గావలసిన సమయములందు
వచ్చి యతనికడ నప్పులు పుచ్చుకొందురు. అప్పడిగిన నెల
రోజులకుఁగాని యతఁడు డబ్బియ్యఁడు. లెక్క మాత్ర మడిగిన
దినమునుండి వేసికొనును. ఇచ్చునపుడును నూటికిఁ బదిరూపా
యల వంతున మినహాయించుకొని మొత్తమునకు వ్రాయించు
కొనును. పత్రములమీఁదఁ జెల్లువేయక యిచ్చిన బాకీలను
దిరిగి వసూలుచేయుటయుఁ గలదు. అప్పసలెత్తుకొని పోక
పోయినను వారివారి యవసరముల నెఱిఁగికొని యా సమయ
ములందుఁ గొలఁదియో గొప్పయో యెత్తుకొనిపోయినట్లు
పత్రముల సృజించుటయుఁ గలదని వాడుక. డబ్బుగలవాఁ
డగుటచే నెచటికేగినను సుందరయ్యమాట గెలుచును. అతని
నెదిరి జయించుటయన్న సామాన్యముగాదు. అన్నిటికంటె
మించిన దుర్గుణము మఱియొకటి యతనికడఁ గలదు. సౌందర్య
వతులైన యువతు లాతనికంటఁ బడఁగూడదు. వానిమూల
మున నెన్నియో కాఁపురములు చెడిపోయినవి.

సుందరయ్య తండ్రి నాగభూషణంగారు. ఆయన
పెత్తనములో నూరు కడు సొంపుగానున్నది. నిశ్చయముగా
నతఁడు ధర్మాత్ముఁడు. బీదసాదలకుఁ దక్కువ వడ్డీలతో
డబ్బిచ్చుచుండెడివాఁడు. వారు మఱీ [illegible]వచెడి బాకీ చెల్లింప
లేని పరిస్థితులలో వదలుకొనెడివాఁడు. ఊరి వ్యవహారము
లన్నియు నాగభూషణముగారికడఁ దీర్చుకొనుచుండెడివారు.

మంచిచెడ్డ లన్నింటికి నూరఁ బెద్దయాధారము నాగభూషణము గారు. ఎవరి దొడ్డియందే కూరగాయ గాచినను దొలిసారి నాగభూషణముగారి యింటికి వచ్చెడిది. ఎప్పుడు చూచినను వారి యింటిముందుఁ బది పదునైదుమంది మనుష్యులకుఁ దక్కువ యుండెడివారుకారు. ఎవరైన గ్రామమునఁ బోట్లాడు కొనుచున్న స్వయముగా నేగి వారి కలహమును జంపి యతఁడు "సర్దుబాటు" చేసివచ్చెడివాడు. ఏ వేళ కెవరువచ్చినను నాదరించి భోజనాది సత్కారములుచేసి తులమో ఫలమో యిచ్చి పంపెడివాఁడు. నాగభూషణముగారియెడ నూరివారికి గౌరవప్రతిపత్తులు మెండు. ఆయన మాటకుఁ దిరుగులేదు.

ఇపు డాయనకాలు క్రుంగినది. కుమారుఁడెక్కివచ్చినది మొద లాతని మాట సాగలేదు. కొడుకు దుష్ప్రవర్తనముఁ జూచి మొదట మిగుల నొచ్చుకొని సరిచేయవలయునని ప్రయత్నించెను. కాని లాభము లేకపోయినది. ఇప్పుడు మఱింత ముదియుటచే వేళకింత పెట్టినది దిని మంచమువీఁదఁ బరుండియుండును.

సుందరయ్య పెత్తనమునకు వచ్చినదాదిగాఁ దారు మారయ్యెను. బీదల కాతఁడేమియు సాయపడఁడు. ఎవరికైన నతఁడు చేసిన నపకారమేగాని యుపకార మెప్పుడునులేదు. గ్రామములో నతనియెడఁ గ్రమముగా ద్వేషము ప్రబలినది. ఇప్పు డతని యింటి కవసరములయందుఁ దప్ప మిగిలిన సమయములలో నెవ్వరును రారు. అందఱికిని సుందరయ్యయన్నఁ గొఱకొఱయే. అతని దుశ్శీలము పెరుగుటకు మఱియొక

కారణము గలదు. తలచెడినది నాగమ్మ యను నొక చెల్లెలాతనికిఁ గలదు. ఆమె నిరంతరము చెవికడ నిల్లు గట్టుకొని దుర్బోధ చేయుచుండును. ఇతరులమీఁదఁ గొండెములు నూరిపోయును. చెల్లెలి మాట లతనికి బాగుగా రుచించును. సుందరయ్య భార్య రాజమ్మ. ఆమె నడిమిరకపు మానిసి. ఆవాహనము లేదు. విసర్జనము లేదు.

సుందరయ్యకు ముగ్గురు కొడుకులు. ముగ్గురు కుమార్తెలు. పెద్దకుమారుఁడు తండ్రి గుణములన్నియుఁ బుణికి పుచ్చుకొన్నాఁడు. తండ్రి చాటువాఁ డగుటచే నతఁ డింక వెల్లడిలోనికి రాలేదు.

ఊరిలో రామయ్య యను నొక రెడ్డి కలఁడు. అతనికి సుందరయ్య చేనిదగ్గఱ నాలుగెకరముల భూమి యున్నది. అతని సర్వస్వ మదియే. శ్రద్ధగా నా మాగాణి పండించుకొని కుటుంబము పోషించుకొనుచుండెను. ఒకనాఁడు సుందరయ్య రెడ్డినిఁ బిలిచి తన యభియోగమునందుఁ "గోర్టులో" నబద్ధపు సాక్ష్య మొకటి చెప్పవలయునని కోరెను. అందులకు రెడ్డి "బాబూ! మా కేల లేనిపోని యీ తగాదాలు. కలిగినంతదిని మెల్లెట్లో బ్రతుకుచున్నాము. ఈ బ్రతుకుకూడ బ్రతుకకుండ మాకుఁదోడు వ్యాజ్యములుకూడనా మీ బోటి వారెందులకైన సమర్థులు. నేనా మాత్రపువాఁడను గాననెను. సుందరయ్య నిర్బంధించెను. నాగమ్మ వచ్చి మా మాట వినక నీ వీ యూర నెట్లుందువో చూచెదము లెమ్మని బెదరించెను. ఏమి చేసినను రెడ్డి యంగీకరింపక వెడలిపోయెను.

## ౨

ఆషాఢమాసము వచ్చెను. రైతులు పిల్లకొక నాగలిఁ గట్టిరి. తడిసిన పొలములలో గట్లు గనిమలు చక్కఁజేసికొని యొకరికంటె ముందొకరు నాటవలయునని తహతహపడు చుండిరి. ఎదుగని నారులకుఁ గృత్రిమపు టెరువులు వేయఁ దొడఁగిరి. పెందలకడనే వంటపనులు ముగించుకొని తలలు దువ్వుకొని కూలి వనితలు గుంపులు గుంపులుగాఁ బొలములకుఁ బోవఁజొచ్చిరి.

రామిరెడ్డి యొకనాఁడుపోయి తన చేనికిఁ గాలువ బారుచేసెను. వెంటనే సుందరయ్య జీతగాండ్రువచ్చి యాటంకపఱచిరి. రెడ్డి కొంతవడి ఘర్షణ మొనర్చెను. కాని వారతనిని మోపనీయలేదు. అతఁ డంత సుందరయ్యకడకేగి మాట్లాడెను. ఈ సంవత్సరముమాత్రము నిన్ను నాటనీయను. నీ తాతదగ్గఱ "ఫిర్యాదు" చేసికొనుమని సుందరయ్య మిన్నెగిరి పోవునట్లు కేకలు వైచెను. నాగమ్మ "మాట వినక తిరస్కరించినట్లు లేదా" యని నోటికి వచ్చినట్లెల్ల మాట్లాడెను.

పాపమా రెడ్డి యేమిచేయును సుందరయ్యకలవాఁడు. తానొక బీదరైతు. ప్రభుత్వములోనికి వెళ్లినను దా నాతని నెట్లు జయింపఁగలఁడు. తనమాట వినువాఁడెవఁడు. బిక్కమొగము వైచుకొని యటనుండి గదలి యూరిలో నలుగురకు నీసంగతిఁ జెప్పెను. కొందఱు జాలిపడిరి. కొందఱు "పెద్ద రైతుచెప్పినది చేయవలదా నీకంత పొగరేలవచ్చినది" యని తూలనాడిరి. "దుర్మార్గుఁడు పాపము నిన్నీపని చేసెనా పాప

మేనాఁటికో బ్రద్దలగును లె"మ్మని సుందరయ్య దుర్గుణము లుగ్గడించిరి కొందఱు. కొందఱు మన కేలయన్నట్లు విని యూర కుండిరి. చివరి కెవరో రెడ్డి కుపాయముచెప్పిరి. "నీ వెచటికేగి నను లాభములేదు. ధర్మారావుగారిదగ్గఱికివెళ్లి మొఱపెట్టు కొనుము. ఆయన మిగుల దయాపరుఁడు. సమర్థుఁడు. నీకొక త్రోవ చూపఁగలవాఁడు" నని.

ధర్మారావు పదియెకరములుగల సామాన్యపు రైతు. గుణసంపన్నుఁడు. భూతదయగలవాఁడు. వితరణశాలి. ఊరిలో నెవరి కాపత్తు వచ్చినను దనకు వచ్చినట్లతఁడు చింతించును. పోయి వారికిఁ జేతనైనంత సాహాయ్య మొనర్చును. ఒక మాదిరి శ్రుతపాండిత్యముకూడఁ గలదు. అపుడపుడు పదిమం దినిఁ బ్రోవుచేసి వీధిలోఁ బురాణము చెప్పుచుండును. గ్రామ ములో నతని కొక విధమైన గౌరవము పలుకుబడి గలదు.

రామిరెడ్డి వెళ్లునప్పటికి ధర్మారావు భోజనముచేసి యప్పుడే బైటికివచ్చి కూర్చుండియుండెను. రెడ్డి యతనికడ కేగి పంచ మొగమునఁ బెట్టుకొని బావురుమని యేడ్చెను. తత్తరపాటుతో నతఁడు రెడ్డిని సముదాయించి కారణమడి గెను. సుందరయ్య తన నబద్ధపు సాక్ష్యము చెప్పుమన్నది మొదలు నాఁటివఱకు జరిగిన సంగతి రెడ్డి పూసగ్రుచ్చినట్లు చెప్పెను. నీ బంగారుచేతితో నింత యన్నముఁ బెట్టితివాసరి నేను నా పిల్లలు బ్రతికెదము. లేకున్న జోలెఁ గట్టుకొని లేచి పోవలసినవారమే యని గోలపెట్టెను. ధర్మారావు కొంతవడి విచారించి రెడ్డిని సాయంత్రము రమ్మనెను.

ధర్మారావును, సుందరయ్యయుఁ జిన్నతనమున నొక బడిలో జదువుకొనిరి. ఇరువురును గలిసిమెలసి యుండెడివారు. సుందరయ్య దుర్మార్గత పెరిగినకొలఁది నొకరి యెడ నొకరికి విముఖత్వము గలిగినది. ఇప్పుడు కనఁబడినప్పుడేదో "ఓహో" యంటే ఓహో" యనుకొనుటతప్ప మఱేమంత స్నేహ సంపత్తి లేదు.

ధర్మారావాలోచించెను. తాను వోయి చెప్పినను మాత్రము సుందరయ్య వినునా ? వినకపోయిన నేమి చేయ వలయును. మొండిచేయి బయటపెట్టి యూరకుండవలసిన దేనా ? తనకును నవమానమేగదా ! ఊరకొనకపోయిన సుంద రయ్యతోఁ దానుగూడఁ గత్తికట్టవలయును. నిష్కారణముగా బలవద్వైరము తెచ్చుకొనుట మాత్ర మేమంత మంచిది యని యతని మనస్సు పలుపోకలు పోయెను. రెడ్డి దీనాననము గోచరించెను. అతని హృదయము తలుగుకొని పోయెను. కానిమ్ము ధర్మరక్షణమున కెన్ని బాములైనఁ బడవలయును. మన కేమియని యింటఁ గూర్చుండినఁ బరోపకార మెట్లు దక్కును. సన్మార్గమున సుందరయ్య వినినసరే లేకున్న రెడ్డి పక్ష మవలంబించెదఁగాక యని కడకు నిశ్చయపడెను.

సాయంత్రము ధర్మారావు రెడ్డిని వెంటఁబెట్టుకొని సుందరయ్య యింటికి వెళ్లెను. సుందరయ్య చూచి యొక చాఁప వేసెను. కూర్చుండిన పిదప ధర్మారావు "సుందరయ్య గారూ ! ఏమిటి రెడ్డి తగాదా యని ప్రస్తావించెను. సుందరయ్య తగాదా కారణము లేవియుఁ జెప్పక రెడ్డి నీ సంవత్సరము

మాత్రము నాటనీయను. ఇట్లని శపథము చేసితిని. అది యంతేయని పెడసరముగాఁ బ్రత్యుత్తరము చెప్పెను. ధర్మా రావు సౌమ్యముగా బాబూ! మీ బోటి పెద్దరైతులు దయ దలఁచిన సరిగాని లేకున్న మా వంటి బీదసాద లేమి కావల యును. నిగ్రహించిన నొక్కనాఁడు నల్లులు మాడినట్లు మాడిపోరా? ఏదో తెలిసీ తెలియక రెడ్డి ప్రవర్తించెను. మీ రాతనిఁ గనికరింపవలయును. కల తప్పులన్నియుఁ గన్న తల్లి కల్మషములన్నియు గంగ భరింపవలె నన్నట్లు మీ రోర్వ వహింపవలయు ననెను.

సుంద : అట్లనుకొని యూరకుండబట్టియే యొక్కొక్కనికిఁ గన్నులు నెత్తికెక్కుచున్నవి. చిన్న పెద్ద తారతమ్యము లేకుండఁబోయినది.

ధర్మా : నిశ్చయమునకుఁ గన్నులు నెత్తికెక్కి వారు మీ కొనరించిన యపకారములేవియు లేవు. బీద లిప్పటికిని మీయందు భక్తిశ్రద్ధలు విడనాడలేదు.

సుంద : చేసిన యపకారము లెందులకు లేవు? కావలసినన్ని యున్నవి.

ధర్మా : ఏదీ వ్రేలుమడిచి యొక్కటి లెక్కింపుడు.

సుంద : ఎందులకు లెక్కింపను, నంగనాచి తుంగబుఱ్ఱవు నీ వొకఁడవు వచ్చితివని యిపు డన్నియుఁ దీరికజేసికొని చెప్పెద. నీ కసలేమిపని మాయింటికేలవచ్చితివి. నీవంటి యల్పుఁడా నాకు బుద్ధిచెప్పునదియుఁ దగవుఁ దీర్చునదియు. తల్లి కన్నము పెట్టలేనివారందఱుఁ దగవు తీర్పరులే.

అని బిగ్గరగా గబగబ నోటికివచ్చినట్లు వాగివైచెను. ధర్మారావున కించుక కోపమువచ్చెను. కాని "తమాయించుకొని" సుందరయ్యగారూ! మీరు పెద్దరైతులముగదా మన మేమిచేసినను గాదనువాఁ డెవఁడను భావములోనే యున్నారు. కాని మిగిలిన విషయము లాలోచించుట లేదు. మీ ప్రక్కబక్క బడుగవ్వాఁడు జీవింపఁగూడదా! ఎంతగొప్పవాఁడైనను బహుజనంబుల నొప్పించి మనలేఁడు. అసత్ప్రవర్తనము గలవాఁ డెప్పటికి జయింపలేఁడు. పైని దైవమొకఁడున్నాఁడు. వాఁ డధర్మమును సహించువాఁడు కాఁడు. ధర్మమేవ జయతి యని పెద్దలు చెప్పుచున్నారు. అధర్మమువలన శుభము లొందినవాఁడు యుగములనుండి యొక్కఁడును లేఁడు. బలవంతుఁడైనను జెడు నడవడిగలవానిని దైవము బలహీనుల చేతనే బాధింపఁజేయును. చలిచీమలు పెక్కుగలిసి బలిష్ఠమైన సర్పమును జంపుటలేదా. పెక్కు తృణము లేకీభవించి త్రాఁడై మదించిన పశువును బంధించుట చూచుచున్నాము. మీ దుష్ప్రవర్తన మిప్పటికే యూరికెఁదలమున్కలైనది. గ్రామీణు లింతవఱకు సహించిరిగాని యిఁక సహింపరు. నే నెట్టివాఁడనైన నేమి మీ రొనర్చినది యధర్మము. ధర్మసంరక్షణమందఱి కర్తవ్యము. అనెను.

సుంద: ఛీ! నీచుఁడా! నోటికిఁ దాళము వేయించెదను. నా వాకిటిలోనుండి లేచిపొమ్ము.

ధర్మా: లేచిపోక నీ యింటఁ బీఠము పెట్టుటకు రాలేదు. నీ యసద్వర్తనము నిన్ను సర్వవిధముల నాశముచేయును.

నీ మేలు కోరినవాఁడను గనుకఁ జెప్పుచున్నాను. ఇప్పటి కైన నీ ప్రవర్తనము మార్చుకొనిన సుఖపడెదవు. నీవు కోరినట్లబద్ధపు సాక్ష్యము చెప్పలేదని రెడ్డిని చేను నాట నీవా? ఎంత యన్యాయము.

చినికి చినికి గాలివానయైనది, సుందరయ్య కేక లూరి నాలుగుమూలల వినఁబడెను. వీధిలోఁ గొందఱు గుంపుగా నిల బడి తగవు వినుచుండిరి. చుట్టుప్రక్కల వారు కిటికీలలోనుండి గోడలమీఁదనుండి తల లెత్తి చూచిరి. చివరకు ధర్మారావు "సరే! నీ యధర్మ మెంతవఱకు సాగునో చేనెట్లు నాటనీయవో చూచెదము లె"మ్మని రెడ్డితోఁ గూడ నటనుండి కదలి పోయెను.

వారరుగు దిగిరో లేదో నాగమ్మ రివ రివ బయటికి వచ్చి, "ఈతఁడు వోయి యాతనితో మొఱవెట్టుకొనెను గాఁబోలు. నేనొక మొనగాఁడనని బయలుదేఱినాఁ డితఁడు. మొగమునకు సిగ్గైనలేదు. మ్రింగ మెతుకులు లేకపోయినను నందఱు పెత్తనదారులే" యని చేతులు త్రిప్పి నాలుఁగు విసరులు విసరెను. ఈ మాటలు ధర్మారావునకును రెడ్డికిని వినఁబడుచునే యున్నవి.

తెల్లవాఱుసరికి నూరిలోని జనము రెండువందలమంది కఱ్ఱలు తీసికొని రామిరెడ్డి చేనికడ నిలువఁబడియుండిరి. వారి కెల్ల ముందై ధర్మారావుండెను. ఊరివారు సుందరయ్య మీఁదికిఁ బ్రత్యక్షముగా వచ్చుటకుఁ దొలుత జంకిరి కాని ధర్మారావు నుపన్యాసమువలన ధైర్యమవలంబించి బయలు

దేటి వచ్చిరి. సుందరయ్యకు జీతగాండ్రుపోయి యీ సంగతి చెప్పిరి. అతఁడుకూడఁ బొలమునకు వచ్చి చూచెను. రెడ్డి చేనికి నీరు బారుచేయుచుండెను. మిగిలినవా రందఱు గూర్చుండి యుండిరి. సుందరయ్య కిక్కురుమనకుండ వెనుదిరిగిపోయెను. చెల్లెలిని బిలిచి వృత్తాంతమంతయును జెప్పెను. "ధర్మిగాడెంత పనిఁ జేసెను! వీనినోట దుమ్ముపడ" యని నాగమ్మ తిట్టి పోసెను. ఇంటఁబడి వారందఱు గుబ్బిసలాడిరి. రెడ్డి చేను నాటుకొనెను.

## 3

రెండుమూడురోజులు గడచినవి. ఆవేళనే ధర్మారావు గారి కుమార్తె చూచిపోవలెనని పుట్టినింటికి వచ్చెను. అందఱు మాట్లాడుకొనుచు బయటి యరుగులమీఁద మంచములు వేసికొని పరుండిరి. నడిజాము వేళ నింటివెనుకఁ గవ్వించి కవ్వించి కుక్క మొఱిగెను. ధర్మారావు లేవకయే కుక్క నదలించెను. కొంతవడికి నింటిలో సవ్వడియయ్యెను. ఆ ధ్వని విని కుమార్తె తల్లిని లేపి 'యమ్మా! యింట్లో నేదో మ్రోఁగిన ట్లున్నదే' యనెను. 'వాని దుంపదెగ పిల్లులు వంటపాత్రలను బొర్లించుచున్నవి కాఁబోలు'నని యామె కన్నులుమూసి కొనియే బదులుచెప్పెను. కొంతసేపటికి ధర్మారావు భార్యకు మెడలో నెవఁడో చేయిపెట్టినట్లుండెను. ఆమె సన్నగా మూలి గెను. దానితో ధర్మారా వేమిటది యని లేచెను. లేచు నప్పటికి నొకఁడు గబగబ పరువెత్తుచుండెను. ధర్మారావు

నిద్రతందరను తత్తరపడి తెమల్చుకొని దొంగలు దొంగలని
కేకలువైచెను. పదిమంది ప్రోగయిరి. ధర్మారావుగారి మను
మని మెడలోఁ గాసులులేవు. భార్య మెడలో మంగళసూత్ర
ములు లేవు. పైగా మెడయంతయు గోళ్లు గీచుకొనిపోయినవి.
ధర్మారావు లాంతరుతీసికొని యింటివెనుకకుఁ బరుగెత్తెను.
ఇంటిగోడకుఁ బెద్ద కన్నమువేసియున్నది. ఆత్రముతో లోనికిఁ
బోయి చూచెను. వస్తువులన్నియుఁ జిందరవందరగాఁ బడవైచి
యున్నవి. ట్రంకుపెట్టెలు మూఁడును లేవు. ఒకదానిలో నూఱు
రూపాయల పైకమును కుమార్తెది బంగారు చంద్రహార
మును, చిన్నచిన్న నగలేవో మఱికొన్నియుఁ గలవు. మిగిలిన
రెండుపెట్టెలలోను గుడ్డలు ఖరీదుగలిగిన పట్టుకోకలు పట్టు
వస్త్రములుగూడ నున్నవి. మొత్తముమీఁద నెత్తుకొని
పోయిన సొమ్మున కేడెనిమిదివంద లంచనావేసిరి. ధర్మారావు
విచారగ్రస్తుఁడై కూర్చుండియుండెను. పలువురు పలువిధము
లుగా మాట్లాడిరి. వెదుకనేల తప్పక సుందరయ్యగారి కృత్య
మిది. సుందరయ్య పెద్దకొడుకు దొంగతనములకుఁగూడ
బయలుదేఱుచున్నాఁడని వినుచున్నామని యెవరో యనివేసిరి.
తెల్లవాఱిన పిదప నొక తాళ్లతోఁటలో వట్టిపెట్టెలు దొరకెను.

మఱియొక నెలరోజులు గడచెను. ధర్మారావున కొక
యరయెకర మరఁటితోఁట గలదు. మంచి కోమలముగాఁ
బెరుగుచుండెను. తోఁటయంతయు గెల వెళ్లియుండెను. ఒక
రాత్రి యెవరో తోఁటయంతయు నఱికి పడవైచిపోయిరి.
ప్రొద్దుననే చూచినవారు వచ్చి ధర్మారావుతోఁ జెప్పిరి.

తోఁటకడ కేగి నోటికడకు వచ్చిన యా చెట్లన్నియు నట్లు నాశనము చేసినందుల కెంతయుఁ జింతించెను. ఇంటికి వచ్చి భార్యతోఁ జెప్పి మిన్నకుండెను. పల్లెత్తి యెవరి నేమాట యనలేదు.

ధర్మారావునకు వీరయ్య యను నొక దగ్గటి చుట్ట ముండెను. అతఁడు వీధిలోఁ గూర్చుండి "ఏమి పనులివి! కేవలము విరోధము మీఁదఁ గాకపోయిన నిట్టివి జరుగునా? విరోధమున్న ముఖాముఖిని జూచుకొనవలయును గాని యీ దొంగయేడుపు లేమిటి" యనెను. సుందరయ్య కొడుకు వీర శేఖర మా త్రోవను బోవుచు నా మాటలు వినెను.

ఆ రాత్రి వీరయ్యయు నతని భార్యయుఁ బండుకొని యుండగా నామె మెడలో నెవఁడో చేయివెట్టెను. వీరయ్య భార్యకూడ మంచి బలిష్ఠురాలు. ధైర్యవతి. వెంటనే చేయి పట్టుకొని దొంగలు దొంగలని కేక పెట్టెను. ప్రక్కనే పరున్న వీరయ్య లేచి యతనిపైఁ బడెను. ఇంతలో నొకఁడు వచ్చి వీరయ్యడొక్కలోఁ గత్తి దిగవైచెను. ఐనను పట్టు విడువలేదు. చుట్టుప్రక్కలవారు వచ్చుచుండిరి. మిగిలిన దొంగ లిరువురు పాఱఁజూపిరి.

దొంగను బట్టుకొనిరి. వీరయ్య శరీరమంతయు రక్త ప్రవాహమైనది. చాలఁ బ్రమాదముగా నుండెను. అతఁడు బ్రతుకునని నిశ్చయ మెవరికిని లేదు. వెంటనే పట్టణములోని వైద్యశాలకు బండిమీఁదఁ దీసికొనిపోయిరి. అచట వీరయ్యకుఁ జికిత్సలు జరుగుచుండెను.

దొంగను విశదములు చెప్పుమని కొట్టిరి. కాని యాతఁ డేమియును జెప్పలేదు. ప్రభుత్వమునకుఁ దెలియఁ బఱచిరి. పోలీసువారు వచ్చి పట్టుకొనిరి. దొంగను విఱుగమోదిరి. ఆ దెబ్బలకుఁ దాళలేక యతఁ డంతయుఁ జెప్పివైచెను. సుందరయ్య కుమారుఁడు వీరశేఖరము తనను మఱియొకనిని వెంటఁబెట్టుకొని వచ్చెననియు, నతఁడే వీరయ్యను బాడిచెననియుఁ దెలిపెను. పూర్వము ధర్మారావుగారియింట్లో దొంగిలించినదికూడఁ దామేనని యొప్పుకొనెను. అరఁటితోఁట నఱకునప్పుడు తాముకూడఁ గలమనియు, వీని కన్నింటికిఁ గర్త వీరశేఖరమనియుఁ బ్రోత్సాహపఱచినవాఁడు సుందరయ్య యనియు నున్న దున్నట్లు చెప్పెను.

పోలీసువారు సుందరయ్య యిల్లు ముట్టడించిరి. వీరశేఖరమును మిగిలినవానినిఁగూడ బట్టుకొనిరి. వీరయ్య నాల్గురోజులుండి వైద్యశాలలోనే మరణించెను. ప్రభుత్వములో నభియోగము జరుగుచుండెను...

ఇదే సమయము నీవుకూడ "ఫిర్యాదు" చేసికొనుము. నీ సొమ్మైనను వచ్చునని ధర్మారావును నలుగురు ప్రోత్సహించిరి. కాని యతఁడు వినలేదు. పోనిమ్ము; వాని యధర్మము వానినేదహించును. నే నింతలోఁ జెడిపోవునది లేదు. ఏమైనను దగవులాడి రచ్చకెక్కుట యంత మంచిదిగాదు లెమ్మని యూరకుండెను.

"కోర్టులోఁ" దగవు విచారణజరుగుచుండెను. వారము వారమునకు "వాయిదాలు" పడసాగెను. సుందరయ్య కుమా

రునికి శిక్ష బడకుండఁ జేయవలయునని డబ్బు చేతులతో వెదఁజల్లెను. సంవత్సరము తిరిగివచ్చునప్పటికి నిలువయున్న ధనము చాలక పదునైదెకరముల భూమి యమ్మెను. ఎంత చేసినను శిక్షపడక తప్పలేదు. తీర్పు జరిగెను. వీరశేఖరమునకు మూడుసంవత్సరములును, మిగిలిన యిద్దఱికి నేడేసిసంవత్సరములును గారాగారవాసము శిక్ష విధింపఁబడెను.

ఆ రోజున సుందరయ్య యింట్లో నొక్కసారి యందఱును గొల్లుమని యేడ్చిరి. ప్రొయ్యి రాఁజలేదు. ఎవ్వరును మొగములుకూడఁ గడుగలేదు.

సుందరయ్యకుఁ బూర్వమున్నంత యెగపు లేదుగాని యూరఁ బ్రతివానిమీఁదను నతనికిఁ గోపము మాత్రము కలుగుచుండెను. జనుల నొకవిధముగాఁ జూచును. అరవిడిచి యెవనితోడను మాట్లాడఁడు. ప్రతివానిని శత్రువుగా భావించును. ఎత్తిపొడుపుమాటలాడును.

## ౪

రాజంపేఁటకు రెండు "ఫర్లాంగుల" దూరములోఁ బెద్ద మురుగుకాలువ యొకటున్నది. దానికి వంతెన సమీపములో లేదు. ఒక మైలుదూర మెగువలో నున్నది. వర్షాకాలము కొన్నిరోజు లా కాలువ యందదు. ఱొమ్ములోఁతువఱకును జనము దిగిపోవుదురు. అంతకు మించిన నెగువకుఁ బోయి వంతెనమీఁదుగా దాఁటిపోవుదురు. వంతెన కట్టవలయునని

ప్రయత్నముచేసి కంకర మొదలైనవి తోలిరిగాని యింతలో నేమి యవాంతరము వచ్చినదో యాఁగిపోయినది. ఆ గుట్టలట్లే నిలిచిపోయినవి.

తెల్లవాఱిన వినాయక చతుర్థి. ఆ దినమున సుందరయ్య యేదో పనిమీఁదఁ బొరుగూరికిఁ బోయి వచ్చుచుండెను. కాలువదగ్గఱకు వచ్చునప్పటికి మసకమసక చీఁకటి పడెను. పోవునప్పుడు ఱొమ్ములోఁతు వచ్చెను. సుందరయ్యకుఁ బ్రవాహము హెచ్చినట్లు తోఁచెను. అందునో యందదో యని సందేహపడెను. చీఁకటి పడినది. వంతెనకుఁ బోయిన నూరక రెండుమైళ్లు చుట్టు నడువవలయునే యనుకొనెను. చివరకు మూర్ఖించి యందదా యని గోచిపెట్టుకొని పంచలు చేతితోఁ బైకెత్తి పట్టుకొని దిగెను. నడుమ కేగునప్పటికి సుందరయ్యకుఁ బ్రవాహ మందలేదు. అతనికి గుండె చెదరెను. పంచలు వదలిపెట్టెను. కాళ్లు తేలిపోయెను. ఈఁదవలెనని ప్రయత్నించెనుగాని యీఁతలో నేర్పు చాలమి నతఁడు నీటి వేగమునఁబడి కొట్టుకొనిపోవుచుండెను. "నేను కాలువలో మునిగిపోవుచున్నానఱ్ఱో" యని కేకలు వేయసాగెను.

ధర్మారావు నిత్యము నావేళ యందు బాహ్యమునకై కాలువవైపునకు వచ్చును. అతఁడు నాఁడును దన యలవాటు చొప్పున వచ్చి పని దీర్చికొని వెనుకకుఁ దిరిగెను. సుందరయ్య వెఱ్ఱికేకలు విన వచ్చెను. ఎవరో కాలువలో మునిఁగిపోవుచున్నారని పరుగు పరుగునఁ బోయెను. సగము దూర మేగునప్పటికి సుందరయ్య యని తెలిసికొనెను. ఇంచుక సంశయ

పడెను. తాను సుందరయ్యకు బద్ధశత్రువు. కానిమ్ము. ఏది యెట్లున్నను నాపత్కాలమున నడ్డుపడుట సజ్జనలక్షణమని యెలుఁగెత్తి "సుందరయ్యగారూ! నేను వచ్చుచున్నాను. భయపడకండి" యని చేరువకుఁ బరుగెత్తెను. అప్పటి కప్పుడే కాల్నడ దాఁటి సుందరయ్య నాలుగుగజములు దిగువకుఁ గొట్టుకొనిపోయెను. ధర్మారావు శబ్దము ననుసరించి దిగి యీఁదుకొనిపోయి చీఁకటిలోఁ దడవెను. సుందరయ్య జుట్టందెను. గాఢాంధకారమునఁ దెలియక యదియే పట్టుకొని లాగెను. లావరి యగుటచే సుందరయ్య రాలేదుగాని యతని పిలకజుట్టు మాత్రము ధర్మారావు చేతిలోని కూడివచ్చెను. అది వదలి యతఁడు తడవి చేయిపట్టుకొని సుందరయ్యను గట్టునకు లాగుకొని వచ్చెను.

సుందరయ్య గట్టెక్కి మంటపుట్టుచున్న తలఁ దడవుకొనెను. పిలకలేదు. ధర్మారావు కట్టుకొనుటకుఁ దన పయిపంచ యీఁబోయెను. సుందరయ్య తీసికొనలేదు. మరల పలకలేదు. బిరబిర తనయింటికి నడచిపోయెను. పోనిమ్మని ధర్మారావును దనయింటికి వెళ్ళిపోయెను.

నాగమ్మకీ సంగతి సుందరయ్య వెళ్ళగనే చెప్పెను. "ఇంకేమున్నది యా దుర్మార్గుఁడు నిన్ను గాలువలోఁ ద్రొక్కివేయవలయుననియే వచ్చెను. లేకున్న జుట్టేలపట్టుకొనును. దైవసంకల్పమునఁ దప్పుకొని బయటపడితివి. చూచెదవేల పొద్దుననేబోయి యతనిమీఁద న్యాయస్థానమునఁ దగవుబెట్టుము. ఈవేళ యిదియైనది. రేఁపింకొకటిగాదా ? యా

దుష్టుని గోదావరి నీరు తప్పక త్రాగింపవలయునని యామె మండిపడెను. చెల్లెలి మాటలు సుందరయ్యకును సమంజసముగానే తోఁచినవి.

తెల్లవాఱగనే పట్టణమునకేగి న్యాయస్థానమున ధర్మారావుపై నభియోగము వేసెను. న్యాయవాది సలహానొంది కొంత డబ్బిచ్చి దొంగసాక్షుల నిద్దఱిని గుదుర్చుకొనెను. తాను కాలువదిగునప్పటికి ధర్మారావు తనను గాలువలోఁ ద్రొక్కివైచుటకు వచ్చినట్లు తాను కేకలువేయఁగా దూరముననుండి సాక్షులు పరుగెత్తుకొని వచ్చినట్లు వారినిఁజూచి యతఁడు తననువిడిచి పాఱిపోయినట్లు కథ యల్లఁబడినది.

తగవు నడచుచుండెను. ధర్మారావు లబ్బున గోలవెట్టెను. న్యాయస్థానమున జరిగినది జరిగినట్లు నిశ్చయము చెప్పెను. నిజమెవరికిఁ గావలయును. రెండుమాసములు జరిగిన పిదప ధర్మారావునకు రెండువందల రూపాయలు "జరిమానా" విధించిరి. పుణ్యమునకుఁబోవఁ బాపమెదురైనదేయని చింతించుచుఁ బెక్కుబాములుపడి యాకఱవుకాలమున రెండువందలు నెట్లో ప్రోవుచేసి యతఁడు చెల్లించెను.

వీరశేఖరమునకు శిక్షపడినది యన్న రెండవనాఁడే నాగభూషణముగారు కాలధర్మము నొందెను. ఈనాఁడు ధర్మారావునకు రెండువందలు "జరిమానా" పడినదని సుందరయ్య నాగమ్మ పరస్పరము చెప్పుకొని యానందపడుచుండిరి. ఆ సాయంత్ర మాకస్మికముగా హృదయ మాగి రాజమ్మ మరణించెను. సుందరయ్య యుగము క్రుంగినది. మరల వివా

హము చేసికొను వయస్సుగాదు పైగాఁ బిల్లలున్నారు. ఏడ్చుచు నెట్లెట్లో యామె యపరక్రియలు ముగించెను. వంటపని యంతయు నాగమ్మమీఁదఁ బడెను.

౫

సుందరయ్య పెద్దకుమార్తెకు మాత్రము పెండ్లి చేసెను. ఆమె యత్తవారింటికి వెళ్లిపోయెను. నాగమ్మకు వంటపనియుఁ బిల్లలసముదాయింపును భారముగాఁ దోఁచెను. నాకేల యీ బెడద యనుకొనెను. ఏదో తగవు కల్పించుకొని సుందరయ్యతోఁ బోరాడి యెప్పుడో విడిచివచ్చిన యత్తవారింటికిఁ జేరెను. వారిచ్చు జీవనభృతితోఁ గాలము గడపుచుండెను.

పిల్లల పోషణముకూడ సుందరయ్యయే చూడవలసి వచ్చెను. ఊరిలో నొకాబిడను నెలజీతమిచ్చి వంటకుఁ గుదుర్చుకొనెను. ఆమె వచ్చిననాఁడు వచ్చును రానిదినమున రాదు. వీలైనప్పుడు సుందరయ్యయింట్లో వస్తువులెల్ల దొంగిలించుకొని పోవును. సుందరయ్య యిల్లు పిల్లలను గనిపెట్టుకొని యెప్పుడు గృహముననే యుండును. ఎప్పుడైనఁ బాలము వెళ్లిన నతనికొఱకు పిల్లలిద్దఱును జిన్నకుమారుఁడును నెదురు చూచుచుందురు. రెండవ కుమారుఁడు మాత్రము పట్టణములోఁ జదువుకొనుచుండెను.

కొంతకాలము గడచెను. మొదటినుండియు సుందరయ్య నియమవంతుఁడుకాఁడు. అతని శరీరమంతయుఁ జెడురోగ

ములతో నిండిపోయినది. వయసుసమళ్లినకొలఁది యొక్కొ క్కటి బయటపడఁజొచ్చెను. ఒకరోజున నుబ్బసము గలుగును. మఱియొకదినమున మూత్రనిరోధము గానిపించును. వేఱొక దినమున నొడలంతయు వాచును. జబ్బుచేసి సుందరయ్య మంచమునఁ బరుండినఁ బిల్లలు ముగ్గురును బిక్కమొగములు వైచుకొని చుట్టును గూర్చుండుదురు. ఆ బిడ్డలను జూచిన సుందరయ్య కడుపు తఱుగుకొనిపోవును. తన ఘటముతప్పిన వారిగతి యేమగును ?

సుందరయ్య పొలముదిరుగుట మానివేసినది మొదలు వ్యవసాయము పాడువడెను. పొలమున ధాన్యము గడ్డి మొద లైన సొత్తంతయు నెచ్చటివా రచ్చట నపహరింపఁజొచ్చిరి. సుందరయ్యకు మానసికచింత శరీరవ్యాధి ప్రబలఁజొచ్చెను. క్రమముగా నతఁడు క్షీణింపసాగెను.

ఒకదినమునఁ బట్టణములోఁ జదువుచున్న రెండవ కుమారుఁడు స్నానమునకుఁబోయి కాలువలోఁ జచ్చిపోయె నని సుందరయ్యకుఁ గబురువచ్చెను. సుందరయ్య కడుపు పగిలిపోయెను. వాయెత్తి భోరున నేడ్చెను. పిల్లలు గొల్లు మనిరి. ఇరుగుపొరుగువారు వచ్చి పలువిధముల సముదాయిం చిరి. నీ విట్లేడ్చినఁ బసిబిడ్డ లేమగుదురని సుందరయ్యకు నొక్కి చెప్పిరి. బుజ్జగించి పిల్లలను దిండి తినిపించిరి. సుంద రయ్య మాత్రము భోజనము చేయలేదు.

ఆతఁడు మంచము పట్టెను. అన్న మేమియు నోటికిఁ బోదు. పిల్లలు మాటిమాటికి వచ్చి నాన్నా! యని కేక

వేయుదురు. సుందరయ్య కన్నులు విప్పి చూచును. వెనుకకుఁ దిరిగి కన్నీరు తుడుచుకొనును. అతనికి బ్రతుకుట భారముగాఁ దోఁచెను. పిల్లల నేమి చేయవలయునా యని రేఁబవలు చింత బాధింపసాగెను. అతని కేమియుఁ బాలుపోలేదు. చివరకు దగ్గఱ యింటివాని నొకనిఁ బిలిచి ధర్మారావును బిలుచుకొని రమ్మనెను.

ధర్మారావిప్పు డూరిలో నెల్లఁ బెద్ద యాసామి. కొలఁది కాలము క్రింద నతఁడు మంచినీటిబావి కట్టింపవలయునని తన చేనిలో గుంట ద్రవ్వించుచుండెను. దానిలో నభ్రకపుగని బయలువడెను. ఆ గనిమీఁద నతనికి వేలకొలఁదిగా విత్తము వచ్చెను. ఇప్పు డతని యింట నిత్యకల్యాణము పచ్చతోరణ ముగా నుండెను. వాని మాట కూరిలో నెదురులేదు.

ధర్మారావును జూడఁగనే సుందరయ్య పెద్దపెట్టున నేడ్చెను. నా దుష్ప్రవర్తనమువలన నే నిట్లు చెడితిని. నీ మాట విననందులకు ఫల మనుభవించితిని. నే నింక బ్రతుకను. నీ కెన్నియో యకార్యములు నిష్కారణముగాఁ జేసితిని. వాని నన్నిటిని మఱచి యీ పసిబిడ్డలఁ గనిపెట్టియుండుమని కన్నీరు విడిచెను.

ధర్మారా వతని నూరడించెను. ఇప్పటికైనను నేఁ జెప్పి నట్లు చేయుము. నీ కేకీడును గలుగదు. ధైర్యమవలంబింపుమని పెక్కు పురాణ విషయములు తడవి చెప్పెను. సుందరయ్య యతని మాటలతో నించుక యూరడిల్లి నీ యిచ్చవచ్చినట్లు నడచెదఁ జెప్పుమనెను.

మొదట నీ భార్యపేర నొక పెద్దచెఱువు త్రవ్వించుము. బీదలను బిలిచి యున్న ధాన్యమంతయుఁ బంచిపెట్టుము. తరువాతఁ జూచెదనని ధర్మారావు చెప్పెను. అట్లయిన నీవే యాజమాన్యము వహించి త్రవ్వించుము. నే డబ్బిచ్చెదనని సుందరయ్య యొప్పుకొనెను.

మఱునాఁటినుండియుఁ జెఱువు త్రవ్వ నారంభించిరి. ఉన్నధాన్యమంతయు బీదలకుఁ బంచిపెట్టఁబడెను. ఎన్ని యౌషధములు సేవించినను దిరుగని వ్యాధులన్నియుఁ గనఁబడకుండఁ బోసాగెను. ఆరోగ్యముచిక్కి సుందరయ్య కొంచెము లేచి తిరుగుచుండెను.

ప్రతిదినమును ధర్మారావు సుందరయ్య యింటికి వచ్చును. అతనితోఁగూడ మఱికొందఱు వత్తురు. ధర్మారావేవో సద్విషయములు చెప్పును. సుందరయ్య విని యానందించును. సుందరయ్య కిపు డెవరన్నను ద్వేషములేదు. ధర్మారావునెడ నతనికి గురుభావము.

# ప్రతీకారము

౧

పదిగడియల ప్రొద్దెక్కినది. అప్పటికిని నాఁడు జంతుశాలా ద్వారకవాటము మూసియేయుండెను. కొందఱు బాలకులు మాత్రము కవాటమునందలి యినుపచువ్వలు పట్టుకొని లోని జంతువులను దొంగిచూచుచుండిరి. కొందఱు పిల్లలు చిన్నచిన్న గడ్డలతో లోన నిటునటు దిరుగుచున్న వానర పోతములను గొట్టి యవి సేయు వికారచేష్టల కానందపడుచుండిరి. మఱికొందఱు, రాజపుత్రుల యాగమనమునకై రాజమార్గము వెంట నిరీక్షించుచుండిరి. కొంతవడికి నశ్వశకటమొకటివచ్చి వాకిట నిలఁబడెను. వెంటనే లోపలినుండి శాలాధ్యక్షుఁడు వచ్చి తాళముఁ దీసి కవాటము విచ్చెను. బండిలోనుండి దిగి రాజపుత్రులు ముప్పురు లోపలఁ బ్రవేశించిరి. బాలకులును జంకుచు లోనఁజొచ్చి ప్రాకార కుడ్యముల నానుకొనియు శాలాస్తంభముల మాటుచేసికొని నిలిచియుఁ జూచుచుండిరి.

రాజకుమారులలోఁ బెద్దవానికిఁ బదునైదు వత్సరముల వయస్సుండును. ముప్పురును రాజయోగ్యములైన యుడుపులు ధరించి ఠీవి వెలయించుచుండిరి. ముందును వెనకను నాయుధపాణులైన భటు లిరువురు కాఁపుదారిగా నడువ మృగములఁ బరిశీలింపఁ దొడఁగిరి. ఆహారమునకై బోనులలో

గర్జించుచున్న సింహములును, మనుష్యులను జూడగనే లేచి యొడలు విఱిచి యావులించు బెబ్బులులును, పెట్టెయలలోఁ గాళ్లు ముడుచుకొని పరుండి గోండ్రువెట్టు భల్లూకములును, మున్నుగాఁగల వివిధ మృగములను జిత్రవిచిత్రములైన యాకారవర్ణములుగల పక్షులను, నీటితొట్లలో జాగ్రత్తపఱుపఁబడిన పెక్కు తెగల జలచరములను, వారు సమీక్షించిరి. కొంతకాలము, గుంపులు గుంపులుగానున్న మర్కటకదంబములతో వినోదించిరి. వానికి రుచ్యములగు పదార్థముల నెక్కువగాఁ దెప్పించిపెట్టిరి. కోఁతులన్నియు నా వస్తువుల నహమహమికతో నొకదాని నొకటి త్రోఁపాడుచుఁ గబళించెను. మఱి కొంతవడి గజ్జెకూర్పులతో నలంకరింపఁబడిన కొదమ పొట్టేళ్ల మీఁద నెక్కి విహరించిరి.

ఆ కుమారకులు మువ్వురును బుష్పపురీ పాలకుఁడైన చంద్రభూపుని తనూజులు. వారు ప్రతిదినమును నుదయము భోజనానంతరము గుఱ్ఱపుబండిలో నెక్కి జంతుశాలకు వత్తురు. దానిలోనున్న వివిధసత్త్వములఁ జూచుచుఁ గాలముఁ బుచ్చి మరల మధ్యాహ్నమింటికిఁ బోదురు. వారికి వానరములన్నఁ గడుఁ బ్రీతి. వానితో నెక్కువ యాడుకొనుచుందురు. అన్నిటికంటె విరివిగా వానికి నాహారమిడుదురు. అందువలన నా శాలలోని మర్కటము లన్నియుఁ జక్కగాఁ గండవట్టి పోతరించియుండెను. కోఁతులకన్నింటికిఁ గులపతి యొక వృద్ధ వానరముండెను. అది కడు దీర్ఘదృష్టి గలది. ఔశనస బార్హస్పత్యచాణక్యాది నీతిశాస్త్ర కౌశలము దానికి జన్మసిద్ధమై

యుండెను. దాని నాయకత్వమునఁ గ్రోఁతులు నిశ్చింతగాఁ గాలము బుచ్చుచుండెను.

కొంతకాల మరిగినది. వృద్ధవానర మొకనాఁటి రేపకడఁ దన మర్కటబృందము నంతయుఁ బిలిచి "మిత్రులారా ! మన మింతకాలమునుండియు నెట్టి విచారములేక రాకుమారుల యాదరాతిశయమున నుంటిమి. ఇప్పుడొక సంకటము మనకుఁ బ్రాప్తించినది. ఏమందు రేని మన యీ జంతుశాలా మధ్యమున నిచ్చటి పనివాండ్రకై యేర్పఱుపఁబడిన పాకసదనము నెల్లరు నెఱింగియే యుంటిరిగదా! దానిలోఁ బ్రతిదినము నొక విచిత్రము జరుగుచున్నది. ఆ సంఘటనముఁ జూచినపుడెల్ల నా మనస్సు వికలమగుచున్నది. రాజపుత్రుల వాహన యోగ్యములైన పొట్టేళ్లలో నశనప్రియమను నొక మేడకము గలదు. అది నిరంతరము జిహ్వాచాపల్యమున నా వంటయింటి లోనికిఁ బోయి తఱిగిన కూరగాయలఁగాని వండిన వంటకములఁగాని తినఁ బ్రయత్నించుచున్నది. దానినిఁ జూడఁగనే సూపకారులు పరిహాసముగా నత్తఱి నేది చేతికందిన నట్టి దానితోఁ గొట్టుచున్నారు. రానురా నిది గొఱ్ఱియకును బాచకులకును నొక విలాసక్రియగా మాఱినది. వినుచున్నారు గదా, యిది మన కపాయహేతువు గాదా యని పలికెను.

క్రోఁతులన్నియు నవ్వి "ఇందులో మనకు రాఁగల యపాయమేమి? మేడక సూపకారుల విలాసములో మన సంబంధ మేమి యున్నది? పృష్ఠతాడనా ద్దంత భంగ" యన్నట్లున్నదే నీ యీ యాలోచన యనెను.

వానర శ్రేష్ఠము మరల నిట్లనియెను. "అయ్యో! మీ తెలివితేట లింత మాత్రములోనే యున్నవా! వినుఁడు చెప్పెదను. లోనఁ బ్రవేశించిన గొఱ్ఱెయను జేతికేదియు నందని సమయమున వంటవాండ్రు కొఱవితోడ నే దినము ననో గొట్టుదురు. పొట్టేలు మేనంతయుఁ దఱచైన బచ్చుతో నిండియున్నది. కొఱవి నిప్పుబచ్చున కంటుకొనును. దాహతాపమున కోర్వలేక గొఱ్ఱెయ తృణప్రచురమైయున్న యా యశ్వశాలలోఁ బ్రవేశించును. గుఱ్ఱపుసాల దగ్ధమగును. అశ్వములు కొన్ని మరణించినను గొన్ని క్షతగాత్రములగును. గుఱ్ఱముల దాహవ్రణములకు భగవంతుఁడైన శాలిహోత్రుఁ డేమి చెప్పెనో యెఱుఁగుదురా? వానరముల క్రొవ్వు వహ్ని దాహదోషమున కౌషధమని తెలిపెను. అట్టి సమయమున రాజు మనల నందఱ నేక కాలమున వధించి యశ్వముల బ్రతికించుకొనును. ముందుగనే మేలుకొని మన మిచ్చోటు విడిచి చనుట బ్రతుకుఁదెరువు. మఱియు నేయింట నిత్య మకారణముగాఁ గలహములు జరుగుచుండునో యట్టి గృహమును జీవింపఁగోరినవాఁడు విడువవలయును. కలహాంతములు గృహములు, పరుషవాక్యాంతము సౌహృదము, దుష్ట రాజ్యాంతములు రాజ్యములు, దుష్టకార్యాంతము యశము నని యు నీతివిదులు చెప్పుదురు. పొట్టేలునకుఁ బాచకుల కను దిన మకారణ కలహము జరుగుచున్న యీ నిలయమును బ్రతుకఁ గోరినట్లైన వెంటనే విడిచి మనము పోవలయును. పయనము కండు. కాననముల కేగుదము".

ముదికోఁతి పలుకుల ననాదరించి మర్కటము లన్నియు నవ్వుచు, "ముసలితనమునఁ బస చెడినది నీబుద్ధి. లేకున్న నిట్లు పల్కెదవే. ఎక్కడి గొఱ్ఱె యెక్కడి యశ్వశాల యెక్కడి తగులఁబడుట. ఈ యసంబద్ధపు టూహ నీకెట్లు కలిగెను. చాలునులెమ్ము నీ దివ్యజ్ఞానము. కావుననే పెద్ద లందురు "నోటపండ్లుండవు. నిరతము లాలాజలము స్రవించును. బుద్ధివైభవ ముండదు. కాన బాల్యము, వార్ధకము నొక్క తెఱుగు" అని. నీ నిస్సారములైన ముదితొక్కు పలుకులు విని రాజపుత్రులు నిరంతరము స్వహస్తములతో నిడుచున్న యమృతోపమాన భక్ష్యముల విడిచి స్వర్గభోగ సుందరంబైన యీ యునికిఁ ద్యజించి యరణ్యమునఁ గషాయకటుతిక్త రూక్షములైన కాయగసరులఁ దినవలెనా ? ముమ్మాటికిఁ దిన లేము. ఈ విషయమున నీ మాట లంగీకరింప" మని గట్టిగాఁ జెప్పెను. అంత నా వృద్ధ మర్కటము బాష్పకలుషిత దృష్టియై "మూర్ఖులారా! మీ రీ తాత్కాలిక సుఖమున కానందించుచుంటిరి: కాని దీని పరిణామదశ నెఱుఁగరైతిరి. ముసిడిపండ్ల రసమువలె మీ యీ సుఖ మవసానమున విష మించును. ఇచ్చట నేయున్న మీ కెల్లరకు నాశము తప్పదు. ఈ కులక్షయమును గన్నులార నేఁ జూడఁజాలను. ఆపన్నుఁ డైన మిత్రునిఁ బరులచేఁ బీడింపఁబడిన తన స్థానమును, స్వదేశ భంగమును, కులక్షయమును నెవరు చూడరో వారు ధన్యు లని పెద్దలు వక్కాణింతురు. మీతోడ నేయున్న నాకును మరణము తప్పదు. నే నరణ్యమునకు వెడలిపోవుచున్నాఁడను

జాగరూకులరై యుండు"డని యా పెద్ద కోఁతి యరణ్యమున కేగెను.

౨

కొంతకాలము కడచనెను. ఒక్కనాఁటి ప్రభాతమున నశనప్రియ మను నా గొఱ్ఱె యథాపూర్వముగాఁ దన యలవాటుచొప్పున మహానసమునఁ బ్రవేశించి, యందు వండుటకై సిద్ధము చేయఁబడిన కూరల నములుచుఁ గొన్నిటినిఁ బుడమి దొరలించుచుండెను. వంటవాఁడు దానినిఁ జూచి పరువెత్తుకొని వచ్చి తాడనసాధనమునకై యిటునటు చూచెను. చేతికేదియు దొరకలేదు. వెంటనే యతఁడు ప్రొయ్యిలో మండుచున్న కట్టె నొకదానిని దీసికొని పొట్టేలును గొట్టెను. పాపమిఁక నేమి! యా గొఱ్ఱె మేని బచ్చునకు నిప్పంటుకొని భగభగ మండసాగెను. తత్తరపడి యేడకపోత మెదుటనున్న యశ్వశాలలోనికిఁ బరువెత్తెను. వహ్ని బాధకుఁ దాళజాలక తృణప్రచురమైన యచ్చోటఁ బుడమిఁబడి పొరలెను. అచ్చటి పనివారలెల్ల గోలపెట్టుచుఁ జేరువకు వచ్చులోపలనే యశ్వశాలకు వహ్ని ప్రాఁకెను. చూచుచుండఁగనే వీతిహోత్రమూర్తి ప్రళయతాండవ మాడఁ జొచ్చెను. జ్వాలలు మిన్నంటెను. ఆకసమంతయు ధూమజ్వాలాకరాళమయ్యెను. లోన బంధింపఁబడియున్న మేలుజాతి గుఱ్ఱములు దాహబాధ భరింపలేక యార్తనాదములు సేయుచు వెఱ్ఱిగంతులు వైచెను. కొన్ని భస్మీభూతము లాయెను. కొన్ని సగము కాలినపిదప నెట్లెట్లో

బయటఁబడి యసువులు వీడెను. కొన్ని మేకులు పెఱుకుకొని త్రాళ్లు తెంచుకొని క్షతగాత్రములై వెలికుఱికెను. ఇట్లు కొంత వడి వైశ్వానరుఁడు ప్రళయ భైరవమూర్తియై పరాక్రమించి తన విశ్వరూపజ్యోతి నుపసంహరించెను. నగరమునుండి వచ్చిన ప్రజానీక మితర శాలల కా యగ్నిభగవానునిఁ జేర కుండ నరికట్టిరి.

చంద్రభూపుఁడు తన యీ యశ్వనాశనమున కెంతయు వగచెను. బ్రతికియున్నవానికిఁ జికిత్స చేయించుటకై యశ్వ వైద్యుల రావించి గుఱ్ఱముల వహ్నివ్రణము లెట్లు మానునని ప్రశ్నించెను. వారంద ఱాలోచించి శాలిహోత్రునిచేఁ జెప్పఁబడిన

* కపీనాం మేదసా దోషో వహ్నిదాహ సముద్భవః
అశ్వానాం నాశమభ్యేతి తమ స్సూర్యోదయే యథా.

అను నీ చికిత్స నెఱిఁగించిరి. వెంటనే యా నరపాలకుఁడు తన యధీనమున నున్న యా వానరముల నన్నింటిని వధించి, త న్మేదస్సు నశ్వ చికిత్స కుపయోగింపుమని యాదేశించెను. అవును. పృథివీశ్వరులు నిరత విత్తాభిలాషులు. ఆత్మలాభమున కెంతటికేనిఁ దెగింతురు. "ఆ రాజున కనుత్తమములైన గుఱ్ఱములవలననే ప్రయోజనముగాని యీ ముష్టి మర్కటములవలన రాఁగల లాభమేమి? రాజాజ్ఞచే వివిధలగుడాయుధాది ప్రహరణముల నాకోఁతి గమియంతయుఁ జంపఁ బడెను.

---

* కోఁతుల మేదస్సుచేత నశ్వముల వహ్నిదాహదోషము సూర్యోదయమునఁ జీఁకటివలె నశించును.

తమ యవినీతికిని దూరదృష్టి లేమికిని గురువాక్య తిరస్కారణ మునకును గలిగిన ఫలప్రాప్తికిఁ జింతించుచు నవి యసువులు వాసెను.

3

కొంతకాల మేగినపిదప నా వృద్ధవానరము కులీనమైన తన కోఁతి పిం డెట్లున్నదో చూడవలయునను కోర్కెఁ బుష్ప పురి కరుదెంచెను. నగరసమీపముననే కులక్షయ వృత్తాంత మంతయు విని చింతాక్రాంతమై యా మర్కటము తిరిగి యర ణ్యమునకుఁ బోయెను. వంశనాశము దానికి సహింపరాని మానసికబాధ కలిగించెను. నిద్రాహారములు రుచింపక పోయెను. నమ్మి యాశ్రయించియున్న తన బంధువ్రాతమును నొక్కసారిగా నశింపజేసిన యా నృపాలునిపై క్రోధ మగ్గ లించెను. ప్రతీకారవాంఛ వొడమెను. వెఱ్ఱిపోసంగిన గతి నది యడవులఁబడి దిరుగసాగెను. ఎవఁడు తనవారి కొనరిం చిన యపకృతిని భయముచేఁగానీ యితర వాంఛలచేఁగానీ యుపేక్ష వహించి సహించునో వాఁడు పురుషాధముఁడుగదా యని తలపోసెను.

నిలుకడలేక వనముల సంచరించుచున్న యా పెను క్రోఁతికిఁ బద్మ మండితమైన యొక విశాల సరోవరము కానఁ బడెను. దాహ ముడుపుకొనఁ గొలనిలోనికి దిగ సమకట్టెను. కాని జాగరూకములైన దాని నేత్రము లొక విషయమును

బసిపట్టెను. వెంటనే మర్కటము శంకించి నిలువఁ బడెను. వనచరములయు మనుష్యులయుఁ బదచిహ్నములు తటాకము లోని కేగినవే కానవచ్చెనుగాని తిరిగి వచ్చిన గుఱుతులు కనిపింపలేదు. మేధావియైన వనౌకసము సరస్సులో నేదేని నొక దుష్టగ్రాహ మున్నదని నిశ్చయించెను. సలిల పానమున కొక యుపాయము వన్నెను. దీర్ఘతరమైన పద్మనాళము నొక దానినిఁ గొని కొలనిలోనికి వంగియున్న చెట్టుకొమ్మపై నెక్కి నీట నా మృణాళాగ్రముంచి నోటితోఁ బీల్చి తనివిదీఱ నీరు గ్రోలెను.

అంతఁ దటాకమధ్యమునుండి యొక రాక్షసుఁడు వెలువడి, "వానరమా! నీవంటి బుద్ధిశాలి నెచ్చటఁగాననైతి. నీ వీనీటఁబ్రవేశించినఁ దప్పక భక్షించియుందును. నీట దిగిన వా రెల్లరు నాకు భక్షణార్హులు. తెలివితేటలచేఁ దప్పుకొంటివి. మెచ్చితి వరమేదైన గోరుకొను" మనెను.

కోఁతి యాలోచించెను. రాక్షసుని కంఠమున దివ్య ప్రభాభాసురమైన యొక రత్నమాల శోభిల్లుచుండెను. దానిం గని యది "మిత్రమా! నీ వెందఱిని భక్షింపఁగలవని యడి గెను. రాక్షసుఁడు "నా భక్షణశక్తి యపరిమేయము. దాని కొక యవధిలేదు; నీటిలో నుండగా నన్నెవ్వరు నేమియుఁ జేయఁ జాలరు. కాని వెలికి వచ్చిన నొక్క బక్క నక్కకుఁ గూడఁ జాలను. నీ విట్లేల యడిగితివో తెలియకున్నది" యని 'జవాబు' చెప్పెను.

వానరము "నాకుఁ బ్రబలశత్రువైన దుష్టరాజొకఁడు

గలదు, నీ కంఠమందలి రత్నహారము నిచ్చితివేని వానిని నా మాటల నేర్పున వంచించి సపరివారముగా నిటకుఁ దీసికొని వచ్చి నీ కాహారముగా నర్పింతును. సమ్మతింతువే యనెను. అందులకు రాక్షసుఁ డానందించి రత్నమాల దానికొసంగెను. వానరశ్రేష్ఠమును నామాల కంఠమున నలంకరించుకొని కార్యమును సాధించినట్లే తలంచుచు మహాముదంబునఁ బుష్పపురాభిముఖంబుగానడచెను.

నగరమునఁ బ్రవేశించినంతటనే పూర్వపరిచితు లెల్లరు దానిం గని యాశ్చర్యసంభ్రమములతో "వానరశ్రేష్ఠమా! యింతకాలంబునుండి నీ వెచ్చటనుంటివి. సూర్యప్రభను దిరస్కరించుచున్న యీ మణిమాల నెట్లార్జించితివని" ప్రశ్నించిరి. దాని కది "ఒక యరణ్యంబున నతిగుప్తంబై ధనదనిర్మితంబైన యొక తటాకముగలదు. భానువారమునఁ బ్రభాతవేళ సూర్యుం డర్ధోదితుండగుచుండగా నెవ్వఁడాజలాశయంబున మునుఁగు నట్టివానికి గుబేర ప్రసాదంబున నిట్టి రత్నమాల లభించు: దీని నట్లు బడసితి" నని చెప్పుచు వృక్షప్రాసాదముల యందు సంచరించుచు బురంబున రాజు నాహ్వానంబునకై వేచియుండెను.

క్రమక్రమముగా నీ వార్త రాజుకడకుఁ బ్రాఁకెను. మహోత్కంఠతో నాతఁడు వానరమును బిలిపించెను. వచ్చిన పిదప "మణిమాలా విషయము సత్యమేనా" యని ప్రశ్నించెను. అందులకా మెకము "రాజా సందియమేల ? ప్రత్యక్షంబునకుఁ బ్రమాణ మవసరమే ? లేకున్న తిర్యక్కునైన నాకీ

రత్నమాల యెట్లువచ్చును ? సందేహమున్న నొకని నాతోఁ బంపుము. సత్యముఁ దెలిసికొనవచ్చు"నని బదులు చెప్పెను - రాజామాటలు విశ్వసించెను. రత్నమాలా లోభము మాన సమున విస్తరింప వానరముతో నిట్లనెను. "అట్లైన నేనే సపరివారముగా వచ్చెదను. వేఱొకఁ డేల? ఒక్కసారిగాఁ బెక్కు మణిమాలలఁ బడయవచ్చును."

మర్కటము లోలోన నానందపడెను. రాజుగారి లోభాతిశయమునకు నబ్బురపడుచు నాశ యెంత బలీయ మురా యని తలంచెను. నిక్కము లోభప్రభావము వాకొన రానిది. ఎంతవానికైన దాని జయింపరాదు. నూఱు గల వాఁడు వేయింటిని గోరును. వేయి లభించిన లక్షకుఁ బ్రయ త్నించును. అదియుఁ బ్రాప్తించిన రాజ్యమునకై యారాట పడును. రాజ్యప్రాప్తి గలిగిన స్వర్గ మభిలషించును. ఆశకు మేర యెక్కడిది ? ముదిసినవానికిఁ గేశములు, దంతములు, నేత్రములు, శ్రోత్రము లన్నియు జీర్ణించును. ఇంద్రియ పాటవ మెల్ల జీర్ణించును. కాని తృష్ణాలత యొక్కటిమాత్రము చిగు రులువెట్టి నవలు వేయుచునే యుండును.

రాజు ప్రయాణము సిద్ధము చేయించెను. రాజకాంతలు రాజ పరివారము, మంత్రి దండనాథాదులు వారు వీరననేల పుష్పపురమునఁ గల వా రాబాలగోపాలము వారివారి కను వైన వాహనము లెక్కి బయలువెడలిరి. అంది పొందినంత వఱకు బంధుమిత్రాదులఁ గూడఁ బిలువనంపుకొనిరి. సర్వుల కును మణిమాలాప్రాప్తికై మానస ముబ్బిట లూగుచుండెను.

భ్రాంతి కల్పితములైన మణిమాలలు కన్పించుచున్నవేమో కూడ. వారి సంరంభ మింతంత యనరాదు. పట్టలేక యెవ్వఁడైన "నీ కెందులకోయీ పసివానికి రత్నమాల నీవుకూడ రావలెనా?" యన్న నతఁడు "నీ కెందులకోయీ ముసలివానికి మణిమాల, నీవుకూడ రావలెనా" యని ప్రత్యుత్తరమిచ్చును.

అపరిమిత పరివారముతో నా పార్థివుఁడు మర్కటమును బల్లకీలోఁ దన యుత్సంగమునఁ గూర్చుండఁ బెట్టుకొని లాలించుచు, నచ్చటచ్చట మార్గమధ్యమున "మజిలీ" లొనర్చుచుఁ గతిపయప్రయాణంబుల గమ్యస్థానము చేరుకొనెను. తెరువున నన్యు లెవరైన నీ ప్రయాణ కోలాహలమును జూచి "ఎచ్చటి కేగుచుండి" రని ప్రశ్నించిన, విషయము నొక్కరును జెప్పరు. చెప్పినచో వారుకూడఁ దమ కేకభోగ్యమైన రత్నమాలాప్రాప్తిలో భాగస్వాము లగుదురనియే వారి భయము. నిశ్చయముగా నగుదురుకూడను. గతానుగతికో లోకః. దానిలో సందేహ మేమున్నది.

సరోవర ప్రాంతమంతయుఁ బలురకముల చెట్లతో మనోహరముగా నుండెను. రాజు తన పరివారమునంతయు నచట విడిసెను. వారి కా రేయి నిద్రలేదు. ఎప్పుడు తెల్లవాఱునా రత్నదామ మెప్పుడు ప్రాప్తించునా యని త్వరపడుచుండిరి. ప్రభాత మాయెను. దూరమున నున్న సూర్యభగవానుని కిరణాంకురములు విశ్వము నప్పుడప్పుడే తొంగిచూచుచుండెను. అట్టితఱి నృపాలుఁడు వానరయూథాధిపునిఁ జూచి "కర్తవ్య మేమి?" యని ప్రశ్నించెను. "భానుబింబము సగముదిత

మగుచుండగనే వీ రెల్ల రొక్కపతి నీట మునుఁగవలయును. వారు వెలికివచ్చినపిమ్మట మనమిరువుర మొకసారి మునుఁగుద" మని యా క్రోఁతి బదులుపలికెను.

సూర్యోదయ సమయంబున నారాజ పరివారమెల్ల నొక్కసారిగా నా తటాకమున మునిఁగెను. మరల వారిజాడ కనిపింపలేదు. ఎంతవఱకును మునిఁగినవారిలో నొక్కరుఁడును లేవకుండుటఁజూచి రాజు మర్కటమను "నీదే"మని యడిగెను. వెంటనే యా చెట్టుఁ ద్రిమ్మరి యొక వృక్షముమీఁదికిఁ జివాలున లంఘించి "దుష్టుఁడా! నా కులమువారినెల్ల సంహరించి సుఖముగా నుండఁదలఁచితివా. దుష్కర్మఫల మనుభవింపుము. నావలె నీవును పరివారహీనుఁడవై యేకాకివై బహుకాలము దుఃఖింపు" మని పలికెను. వానర మొనర్చిన ప్రతికృతి కెంతయు జింతించుచు నా నరవరుఁడు వెడలిపోయెను.

---

భారతీ ప్రెస్, తెనాలి — 1954.

